# తిరుక్కురళ్



తెలుగు సేత:

గురుచరణ్

ముద్రణ డిసెంబర్, 1986



వెల : రూ. 20-00

ప్రాప్తిస్థానం
శ్రీ దూతలూరి జగన్నాథం
369, నెహ్రూబజార్,
ఊత్తుకోట 602 026



ముద్రణ : క్రాంతి ప్రెస్, మద్రాసు - 1.

# విషయసూచిక

## (ధర్మకాండము)



## (అర్థకాండము)

# అంకితము



అమరకావ్యమైన తమిళ వేదమునకు
తెలుగుజేయ నన్ను బలుకరించి
కామకోటి యొసగె శ్రీముఖమ్మును వారి
దివ్యచరణసీమ దీవి విడుదు

చంద్రశేఖరేంద్రు సద్గురు స్మరణమ్మె
నిత్యజపము గాగ నిలుపుకొంటి
కామకోటి కన్న కనబడు దైవమ్ము
వేరె లేదు జూడ విశ్వమందు.

గురుకటాక్షమునను తిరువళ్ళువర్ కురళ్
తెనుగుజేసినాడ దెలిపినంత
మూలగ్రంథమునకు ముప్పురాకుండగా
తిక్కనాది కవుల మ్రొక్కి భక్తి.



చిరునగు వొలుకంగ శృంగేరి స్వాములు
ప్రశ్నవేసి నన్ను బలుకరించి
శ్రీముఖమ్ము నిచ్చి ప్రేమ జూపిరి వారి
పాదపద్మములకు ప్రణతు లిడుదు.

— గురుచరణ్



శ్రీ కాంచి కామకోటి జగద్గురు జయేంద్ర సరస్వతి స్వాములు
అనుగ్రహ సాన్నిధ్యంలో గురుచరణ్

**Sri Chandramouleeswaraya Namaha**

**Sri Sankara Bhagavadpadacharya Paramparagatha**
**His Holiness Sri Kanchı Kamakoti Peetadhipathi**

**JAGADGURU SRI SANKARACHARYA SWAMIGAL**
***SRIMATAM SAMASTHANAM***
**KANCHEEPURAM - 631 502.**

**Cam**  **Date:**

తిరుక్కురళ్ ప్రాచీనమైన గ్రంథము. అందులో అనేక ధర్మములు చెప్పబడి యున్నవి. అన్ని మతస్థులకు, అన్ని దేశస్థులకు, అన్ని కాలములకు సరిపోవు ధర్మములే అందున్నవి. లోకములో అందరూ తెలుసుకోవడానికి అన్ని భాషలలో దాన్ని అనువాదము చేస్తున్నారు. గురుచరణ్ దూతలూరి జగన్నాథంగారు తెలుగులో చేసిన అనువాదము చూసినాము. తేటగా ద్రాక్షాపాకములో నున్నది. ఇదివరలో వీరు అనేక గ్రంథములు వ్రాసి యున్నారు. ఇంకనూ ఇటువంటి గ్రంథములు వ్రాసి శ్రీ చంద్రమౌళీశ్వరానుగ్రహమునకు పాత్రులు గావలసినదిగా ఆశీర్వదిస్తున్నాము.

కాంచీపురం
రక్తాక్షి మాఘబహుళ ౧౪
సోమవారం

నారాయణస్మృతి

**SRI JAGADGURU SHANKARACHARYA**
**DAKHINAMNAYA SRI SHARADA PEETAM**
***SRINGERI* - 577 139 (Karnataka)**

| | |
|---|---|
| **Camp:** | **Madras** |
| **Ref:** | **D 1/** |
| **Date:** | **29-10-86** |

శ్రీ గురుచరణ్ గారికి,

నమస్కారములు.

మీరు తమిళభాషలో ప్రసిద్ధిచెందిన తిరుక్కురళ్ అను గ్రంథమును తెలుగు భాషకు అనువాదము చేసినది శ్రీచరణులు తిలకించినారు.

మానవుడు తన దైనందిక జీవితములో చేయు తప్పులను దిద్దుకొని ధార్మిక జీవనము గడుపుటకు ప్రేరణ ఇచ్చు గ్రంథము తిరుక్కురళ్.

తమిళనాడులో ఈ గ్రంథము అధికప్రచారములో ఉన్నది. ఈ గ్రంథమును తెనుగున అనువదించి దాని స్వారస్యమును తెలుగు ప్రజానీకమునకు అందజేయ దలచిన మీ ప్రయత్నము సఫలమగుగాక యనియు, శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల అనుగ్రహము వలన మీకు శ్రేయస్సు గలుగుగాక యనియు శ్రీ జగద్గురు మహాస్వాములవారు ఆశీర్వదించినారు.

శ్రీచరణులు అనుగ్రహించిన ఆశీర్మంత్రాక్షతలను మరియు శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల ప్రసాదమును పంపుచున్నాము.

ఇట్లు
జి.వి. గిరిధరశాస్త్రి

பாலமுருகனடிமை

அருள்மிகு பாலமுருகன்
திருககோயில்,
இரத்தினகிரி,
கீழமினனல்-632 517
வட ஆற்காடு மாவட்டம்,
தமிழநாடு.

அன்ப!

அருளாசி,

உலகப் பொதுமறையாம் திருக்குறளை தெலுங்கு மொழியில் மொழிபெயர்த்துள்ள அன்புத் திரு. செகந்நாதன அவர்களைப் பெரிதும் பாராட்டுகிறோம. திருவள்ளுவப பெருநதகை யாத்த திருக்குறள எம் மொழியினருக்கும், சமயத்தினருக்கும், மதத்தினருக்கும், எவ்வினத்தவருக்கும்—ஏன? உலக மக்கள அனைவருக்கும் ஏறபுடைய பொது மறையாகும. முக்காலத்தையும் உணர்ந்து அறிந்து, தெளிந்து தேர்ந்து தாம் கணட அனுபவ வாயமையுணர்வுகட்கு எழுத்துருவில இரண்டே வரிகளில் ஏழு சீர்களைக கொணடே எழுதிய அனுபவ நூலாகும் அறம்-பொருள்-இன்பம என வகுத்து வீடு பேற்றை அவரவர் வழிமுறையில் வகுத்துக கொளளட்டும என விட்டுவிட்டாரோ எனனவோ? தமிழ மொழியில 2,0 6 ஆண்டுகட்கு முனபே எழுதிய திருவளளுவர் இன்று நம்மோடு இல்லாவிட்டாலும் அவர் விட்டுச் சென்ற எழுத்துச் செல்வம் நமக்கே, அன்றி உலகமக்களுக்கும் சொந்தமாகி விட்ட ஒரு பொது மறை நூலாகும. பிற மொழிகளில மொழி பெயர்க்கும போது இந்நூலில மையக் கருதது சிதையாமல, அவர் உணர்ந்துளள உணர்வுகளை அப்படியே படம் பிடித்துக் காட்ட நம் மனக் கதவுகளை விரிந்து பார்த்துத் பெருநோக்குடைய ஒனறாக மாறினால் தான முடியும் அத்தகைய முயற்சியில ஈடுபட்டு உழைத்து உருவாக்கிய உத்தம குணம் படைத்த பணபாளரை நெஞ்சார வாழத்துகிறேன்

ஒப்பம்
பாலமுருகனடிமை

"அறமும் மெய்ம்மையும் வெல்லுதல் விழைவு".

Vidwan M A DEVARAJAN, M A
Pa nthamizhp Pava ar, Na as r yar

UTHUKOTTAI
30—11—86

# INTRODUCTION

I am very pleased to wr te a foreward to the universal book, named "Thirukkural" in Telugu, translated by my fr end Mr Dhootaloori Jagannathan al as Guru Charan a Telugu-Scholar and a well known poet I have known Mr. Guru Charan, s nce 1954 He is a person who wants to know as many languages as poss b e by h s own effort He knows bes des h s Mother-tongue, Eng sh, Tam l Hindi and Sanskr t Thirukkural, a universa book, attracts h s heart So, he stud ed it earnestly and wants to translate it into Te ugu At first, some years ago, he publ shed a translat on-work on Thirukkural Arathupal i e on Virtue That book is now out-of-stock So he made up his mind to translate all the coup ets of Kural, the Virtue, the wea th and the Love parts, in all 1330 Kurals into luc d and beautifu Telugu coup ets, just l ke Kural and comp eted h s work successfu ly

For th s endeavour, he laboriously studied many commentaries on Th rukkural, such as commentar es by Parime azhagar, K M Balasubraman am, Ma lai Siva Muthu. Th rukkura Munuswami, Namakkal Kavignar, Rama ngam P la Dr. Mu. Varadharajan in Tam l and translations in Hindi and Sanskrit as well as those written by Rev Dr G U. Pope and Rev Rob nson and V V S Iyer in English. He calm y compared them many a t me, and tried to understand the true meaning of each Kural As a result of h s comparative study, he was confronted with so many sensible doubts on the var ed comments

Then and there, he asked me for my opinion on h s doubts. In good soothe, they are I dare say, appreciable and thought—provok ng, and these doubts induced me to ponder over them Subsequently, we have gone through the commentaries of Parime aghgar, Manakkudavar, Parithiyar, Kalingar and some of the present commentaries, in order to understand the real meanings of those couplets. I, to the best of my knowledge, clarified his doubts and expressed my op nion on them He accepted them to a greater extent

For instance, I l ke to quote some of h's doubts on several Kurals and Commentaries, hereunder to show his deep research :

1. "..., ஆதி பகவன் முதற்று" (1) He opined that Aadhi is superfluous here. Bhagavan itself is enough.

2 "பொறிவாயில் ஐந்தவித்தான் பொய் தீர் ஒழுக்க நெறி" (6). He raised a doubt on the phrases "ஐந்தவித்

தான" ın I Chapter and III Chapter and on "பொயதீர் ஒழுக்கம".

3. "நத்தம்போல் கேடும் உளதாகும சாக்காடும (335) He wants the correct meaning for the word நத்தம் போல் கேடும் உளதாகும சாக்காடும".

4. "ஆறறின் ஒழுக்கி அறவிழுக்கா இலவாழ்க்கை' (48) He enquired what ıs "ஆற்றின ஒழுக்கி".

5 "தோனறின புகழொடு தோனறுக" (236) He refuted Parımelazhagar's Uraı (உரை) and to d me ıt ıs ıncons stant with our lıfe.

6. "கற்றீண்டு மெயப்பொருள் கணடார்" (356) H s doubts on "கற்று" and "மெயப்பொருள்".

7 "ஈதல இசைபட வாழ்தல " (231) He totally refused to accept the comments of Parıme azhagar for the phrase 'ஈதல, இசைபட வாழதல்" ın ımperatıve mood

8 ' துறபபார்மன துப்புரவு இல்லார் உறறபால ஊட்டா கழியு மெனின் (378) He enquıred about the correct mean ng for the phrase".

9. "தம்மில இருந்து தமது பாத்துணடற்றால் அமமா! அறிவை முயக்கு" (1 07) He ra sed ques- t ons about the s mı e here used

10 "வினை கலந்து வென்றீக வேந்தன ... விருந்து" (1268) He asked quest ons about" விருந்து, வினைகலந்து and மாலை விருந்து அயர்கம்".

11 "அருள் வெஃகி ஆற்றின்கண நின்றான் " (176) He asked how can a person who desıres grace of God, desıre for worthless wealth? He also wanted the true meanıng of "ஆற்றின கண்".

I am much ındebted to h m for h s doubts, for they are really thought-provokıng, they ınduced me to study once agaın the Th rukkural ın a new footıng by wh ch I acqu red much and found new dımens ons

I op ne th s genu ne translatıon ın Telugu, would become the best one ın that language and would receıve the entıre acc amat on by the learned as well as by the publıc

The work of Guru Charan ıs merıtorıous and praıseworthy. I w sh my r end a brıght future I request bım to spare sufficıent tıme to trans ate some other Tamıl Kavyams and prabandhams ınto Telugu and render further servıce to the lıterary world of Tamıl and Telugu.

M. A DEVARAJ

**S. Pattabiraman,** M L A,
Th ruva ur Const tuency

Pandur V age & Post,
Th ruva ur Ta uk,
Chenga pattu D str ct,
Phone :
Hoste : 560330
Res dence 616074
Date . 1—12—86

எக்காலத்திற்கும் எந்நாட்டவருக்கும் எம்மதத்திற்கும் சம்மதமான தமிழ் மறையாகிய திருவள்ளுவரின் திருக்குறளை திரு குருசரண் அவர்கள் தெலுங்கில் மொழிபெயர்ப்பு செய்ததை நான் மிகவும் பாராட்டுகின்றேன். எனக்குத் தெரிந்த குறள்களைச் சொல்லி அவர் மொழிபெயர்ப்பு கேட்டு இரண்டிற்கும் எவ்விதமான வேறுபாடும் இல்லாமல் இருப்பதை அறிந்து பெரிதும் மகிழ்ந்தேன். எனக்கு இரண்டு மொழிகளிலும் நல்ல பயிற்சியுண்டு. இந்நூலைப் படித்துப் பார்த்ததில் தமிழ்த் திருக்குறள் போலவே தெலுங்கிலும் படித்தவுடன் புரியும்படியாய் மிக நன்றாக முறைப்படி மொழிபெயர்ப்பு அமைந்துள்ளது. அரசாங்கம் இதற்கு ஆதரவு தருமாறு கேட்டுக் கொள்கின்றேன்.

# PREFACE

**Mr H. Narayana Rao** M A., B T.

Gurucharan's Telugu translation excels the excellences of other translations, in one significant aspect, in that this translator has achieved singular success in his strict adherence to the letter and spirit of Thiruvalluvar's world famous Tirukkural, that ancient treasure house of wisdom. While other translations vie with one another in diction and idiom, drawn from the rich variety of metrical versatality of our Telugu language. Gurucharan's translation breathes the same breath of Thiruvalluvar's remarkable style, characterised by the terse and tense intensity, evoking a world of thought in a single couplet, the like of which is found nowhere in the literatures and scriptures of the world. And that is what, I find, has been the guiding star of this Telugu translator.

If "Brevity is entirely the soul of wit" with the great Master, I would vouch for Gurucharan's to be the nearest to it. Thus this translation is the fulfilment of the paramount necessity of easy access to the soul of Tirukkural in Telugu, for the first time.

If today it is regrettably true that this classic of classics is so little known among the six crores of Andhras, the fault is not a little due to the prevalent Telugu Translations, lacking simplicity. That is why Gurucharan Confines himself to the true role of a translator's talent to hold a faithfull mirror to the original.

As such it is my fervent hope that Gurucharan's Telugu Tirukkural fulfills his mission of propogating the ideals of Man's perfectibility displayed in the Immortal Tirukkural, as the finest fruit of the two sister cultures of Tamil and Telugu linguistic branches of the same Dravidian civilisation, South of the Vindhyas.

*Ponneri — 601 204.*

**(H. Narayana Rao)**
*Signature.*

## APPRECIATION

Thiruvalluvar was a great saint and moralist. He composed his Kavya in a systematic way. He has put the essence of all philosophies into short couplets in a highly attractive and appealing manner. There is no need of stressing the importance of the study of Kural which stands out as an all-time guide of mankind.

I am very glad that Sri Gurucharan translated the Thirukural into Telugu. The translation is very nice and lucid that it looks as an original work.

One hopes that Sri Gurucharan will produce such works for the benefit of society.

Dr. Gandham Appa Rao M.A. Ph.D.
*(Signature)*
Prof. & Head of the Dept. of Telugu
University of Madras.

**Vidwan E. MUNIRATHNAM NAIDU, M.A.,**
*Headmaster*
**Sri Ramapuram, CHITTOOR - 517 587.**

*Date:* **19-12-86**

శ్రీ గురుచరణ్ గారికి నమస్సులు:

తిరుక్కురళ్ అత్యంత ప్రాచీనమయిన గ్రంథరాజము. క్రీస్తు శకారంభములో వెలసినట్లు చరిత్రకారుల నిర్ణయము. అది తమిళవేదము. దానికిది తెలుగు అనువాదము. ఇంతకాలానికి దీనిని చూసే పుణ్యం నాకు దక్కినది. ఇందులోనున్న 1330 శీర్షికలను చదువుటకు గంట—గంటన్నర కన్నా ఎక్కువ సమయం పట్టదు. అర్ధ ఆటవెలదులతో శ్రీ గురుచరణ్‌గారు అనువదించి, అందించినది- హృద్యంగా నున్నది. అర్థంకాక - అన్వయంకాని పద్యం ఏ ఒక్కటీ ఇందులో లేదనటంలో అతిశయోక్తి కాదు. భావశబలిత, బిగువు ఎక్కడా తప్పింది కాదు. చదువుచున్నంతసేపు స్వతంత్ర గ్రంథముగా తోస్తుందేకాని అరవ భాషనుండి అరువు దెచ్చుకొన్న అనువాదముగా మాత్రం—ఏమాత్రం తోచదు. ఇది గురుచరణ్‌గారి అనువాద ప్రక్రియలోని సంపూర్ణత.

తిరుక్కురళ్ వంటి నైతిక గ్రంథాన్ని అదే పద్ధతిలో తెనిగించట మనేది అల్పస్వల్పం కాదు. ఆ భాషాపాండిత్య పరిపక్వతతో బాటు ఏ ఏ పదం ఏ అర్థమిస్తుందో సరిగ్గా నిర్ధారణచేసి—ఆ పదానికి తగ్గ తెనుగుపదం—తెనుగుదనం నిండియున్నట్లుగా ప్రయోగించటం ఏ ఒక్కరికోగాని సుసాధ్యం కాదు—వీరికి సాధ్య మయినట్లుగా.

ఎప్పుడో రెండువేల యేండ్లనాడు తిరుక్కురళ్ నందు వాడిన పదములకు ఇప్పుడు నిఘంటువుల బెట్టుకొని వాటి అర్థం నిర్ధారణ చేయటం - బొత్తిగా సరిపడని పని. ఈ పనికి రెండు భాషలలోను సమగ్ర పాండిత్య మున్నంత మాత్రాన సరిపోదు. ఆ యా భాషల్లో నున్న నుడికారపు సొంపులను ఆకళింపు చేసికొన్న వారుగా నుండ వలయును. ఆవిద్య మాన్యశ్రీ గురుచరణ్ గారికే దక్కినది. అందుకు అటు తమిళ భాషాభిమానులు—ఇటు తెలుగులోకం వారిని తప్పక సత్కరించి తమ తమ కృతజ్ఞతను తెలియజేయగలరని ఆశిస్తున్నా - అర్థిస్తున్నా—

సదా శ్రీ సాయినాథ నామస్మరణతో,

# ACKNOWLEDGEMENT

When I approached Dharmamoorthy Sriman V. Gangaswamy Naidu garu President, Tamil Nadu Kamma Mahajana Sangam and leading industrialist in Tamil Nadu and Proprietor of Amarav[illegible] Paper mills Udumalpet, Coimbatore District, he so spontaneously came forward to bear the entire cost of the printing Paper for the publication of my Telugu Translation of Tiruvalluvar's TIRUKKURAL.

Similarly my worthy friend Sriman P. Annamalai Avargal, Trustee of Sankar Math, Bugga Agraharam, and Sriman Duvuri Bhaskara Reddy, M.A M Ed, Headmaster. D. V. S. Reddy Higher Secondary School Minjur, have made generous donations to the worthy cause, I have undertaken.

To these three philanthropists, I express my eternal debt of gratitude and pray to the Almighty for their long and prosperous life.

GURUCHARAN.

పోషకులు



ధర్మమూర్తి
శ్రీ వి. గంగుస్వామి నాయుడుగారు

# కృతజ్ఞతలు

దేవుడు ఎవ్వరు ఎవరిని ఏ కార్యము చెయ్యమని నిర్ణయిస్తాడో వారు ఆ కార్యం నిర్వహిస్తారు, పేరు వహిస్తారు.

కోయంబత్తూరు జిల్లా ఉడుమలపేట వాస్తవ్యులు, అమరావతి పేపర్ మిల్స్ యాజమాన్యులు, తమిళనాడు కమ్మమహాజన సంఘాధ్యక్షులు శ్రీమాన్ ధర్మమూర్తి V. గంగుస్వామి నాయుడుగారి ఔదార్యమే ఈ పుస్తకం అచ్చుకావడానికి కాగం కాగిత కైంకర్యం పూర్తిగా.

శ్రీమాన్ K. అణ్ణామలైగారు మిగతా ఖర్చులు భరించినవారిలో స్మరణీయులు. పుణ్యక్షేత్రం తిరుత్తణిలో వుంటూ దగ్గరలో వున్న శ్రీ శంకరమఠ పునరుద్ధరణకు పూనుకున్న పుణ్యాత్ములు. శ్రీ కాంచికామకోటి పెద్దల అనుగ్రహమునకు పాత్రులు, నాకు మిత్రులు. వారిని గురించి ఎంతో చెప్పాలనుకున్నా చెప్పలేక పోతున్నా. వారు దగ్గరలో శ్రీ శంకరమఠమునకు చేసిన, చేస్తున్న కైంకర్యం చెప్పే దానికన్న అందుకే వారు షట్టారంటే సరిపోతుంది.

శ్రీయుతులు దువ్వూరి భాస్కరరెడ్డిగారు మీంజూరు హైస్కూలు హెడ్మాస్టరుగా ఉంటున్నారు. వారు నేను ఒక్కటిగా చదువుకున్నాము, ఒక్కటిగా వుంటున్నాము. కష్టాల్లో నష్టాల్లో అట్లాగే.

ఆదరించి దయతో సదభిప్రాయమును అనుగ్రహించిన శ్రీశ్రీ రత్నగిరి బాలమురుగనడిమై స్వాములు, తిరుక్కురళ్ అభిమానులు. మూలాన్ని తెనుగుచేసినందుకు వారు నాపై చూపిన కనికరమే ఈ గ్రంథమునకు వారిచ్చిన సదభిప్రాయము.

శ్రీమాన్ విద్వాన్ మానణ్ణా. దేవరాజన్ M. A. గారి తోడ్పాటు మరువనకే రానిది. వాస్తవంగా నన్నొక తమిళ పండితునిగా తీర్చిదిద్దారంటే ఆశ్చర్యపడవలసిందే. అంతగా ఈ అనువాదమునకు తోడ్పడ్డారు. వారితో జరిపిన నిత్య సంప్రదింపులే ఈ కావ్యపు నిండుదనం.

పూజ్యశ్రీ H. నారాయణరావుగారు నాకు మిత్రులుగా ఉన్నా, పూజింపదగ్గవారు. వారి ఆలోచనలు, సలహాలు నాకు మాత్రమే గాక, ఎల్లరకు మార్గదర్శకం. చక్కని ఆంగ్ల వైదుష్యం, ఆంధ్రములో తగ్గని పాండిత్యము వారిది. వారి చూపుతోనే నా రచనలన్నీ రూపుదిద్దుకొన్నవి.

శ్రీరామాపురం హైస్కూలు హెడ్మాష్టరుగా ఉన్న విద్వాన్ ఇమగుర్తి మునిరత్నం నాకు మిత్రరత్నం. నా కన్నా చిన్నే, విద్యలో పెద్దవారు. డిగ్రీలు సంపాదించడం వారికి క్రీడారంగం. చదువులపుట్ట.

తిరువళ్ళూరు నియోజకవర్గ శాసనసభ్యులు దృఢచిత్తులు, కార్యసాధకులు, గౌరవనీయులు శ్రీపట్టాభిరామన్‌గారు నే చేసిన తిరుక్కురళ్ తెనుగు అనువాదము విని రాజకీయంగా వారు చేయగలిగిన సహాయం చేస్తున్నందులకును,

ఎవరిని ఏమడగాలో చేతగాని నన్ను నలుగురికీ పరిచయం చేయించి, వారిచే సహాయం చేయించి నా శ్రేయస్సునే ఆశించే మిత్రుడు కలవ V. మునిరత్నం నాయుడుగారికిని,

అన్నీ జరిగి, అచ్చు ముచ్చటగా లేకుంటే అయిదవతనం లేనట్టుగా వుంటుంది. అలా చేయక గ్రంథాన్ని ఏ విధంగా ముద్రించాలో, ముద్రించే నైపుణ్యం కలిగి, కవుల మన్ననలకు పాత్రులుగా నున్న ధనికొండ శ్రీధర్ గారికిని,

మద్రాసు విశ్వవిద్యాలయ తెలుగుభాషా విభాగాధ్యక్షులు, పూజ్యశ్రీ గంధం అప్పారావుగారు, M A. Ph D. సౌహార్దంతో నన్ననుగ్రహించి ఇచ్చిన సదభిప్రాయమునకు సహస్ర నమస్కారములు. అందరికీ ఈ విధంగా కృతజ్ఞతలను అందజేసుకుంటున్నాను.

విద్వాన్ శ్రీ మేదూరి రామశేషయ్యగారికి అందరికివలె కృతజ్ఞత చెప్పి వారి ఋణము తీర్చుకోలేను. వారి పుస్తకాన్ని ఆమూలాగ్రం పరిశీలించి సలహాలు, సవరణలు సూచించుటమేగాక, నా జీవితములో ఏర్పడ్డ ఒడుదుడుకులకు నదుమిచ్చిన దిట్ట, సహనశీలి. అతనొక గొప్ప జ్యోతిష్కుడనే విషయం ఎక్కువ మందికి తెలియదు. వారిని మరువలేను.

— గురుచరణ్

# ప్రస్తావన



ఇప్పటికి రెండువేల యేండ్లనుండి అనుశ్రుతంగా వినవస్తున్న తమిళవేదము తిరుక్కురళ్. చతుర్విధ పురుషార్థములలో మొదటి మూడింటినే గ్రహించి 1330 పద్యాలలో నొక్కి వక్కాణించే చక్కని ప్రామాణిక గ్రంథము.

శ్రీమద్భగవద్గీత, బైబిలు, ఖురాను వంటి మతగ్రంథము కాదు. కానప్పటికీ అంతకన్నా ఎక్కువ మర్యాదనే సర్వత్రా ఇది సంపాదించుకొన్నది. మన శతక వాఙ్మయములో దీనిని జతకట్టి భారతముతో ముడిపెట్టుట సరికాదు. ప్రపంచములో దీని కనువాదము లేని భాష ఏదీ లేదు.

తెలుగు బిడ్డనై అరవ గడ్డపై పెరిగి పెద్దవాడనైనందుకు తీర్చుకొన్న ఋణమే ఇప్పటికి ఈ తిరుక్కురళ్ తెనుగు అనువాదము.

నిర్దుష్టమైన వలయము గీయుటకు కేంద్ర మెంత యవసరమో స్వచ్ఛంద జీవితము గడుపుటకి గ్రంథమంత యుపయుక్తమని నా తలంపు. తత్కారణమే యీ తెనిగింపు.

తెనిగింపున నింపు సొంపుల నింపడము కవిబ్రహ్మలకు - కవి సార్వభౌములకే చెల్లును, వారి సంస్మరణ ఫలితమే నా యీ సాహసము.

అనువాదం యెప్పటికీ అనువాదమే అనే వాదాని కిది దూరమై, మన నోటికి బట్టువడి మనదైతే అదేచాలు నా కృషికి పదివేలు.

— గురుచరణ్

# దైవ ప్రార్థన



అచ్చుమూలమైన దక్షరంబుల కెల్ల
వేద వేద్యు డాది విశ్వమునకు 1

చదివినందుకేమి సఫలమ్ము సర్వజ్ఞు
చరణములకు బూజ సలుపకున్న 2

సుమన గమను పాద కమలమ్ములకు సేవఁ
జేయువారి బ్రతుకు క్షేమ మిలను 3

వలయు వద్దులేని వాని పాదము లంద
శాశ్వతముగ దొలగు సంకటములు 4

బంధ ముక్తుడగును ద్వంద్వ కర్మలనుండి
విశ్వమయుని కీర్తి వినుతిజేయ 5

ఇంద్రియమ్ము లణచి యింద్రియాతీతుని
సత్య మార్గమరయ నిత్యసుఖము 6

నిరుపమాను దివ్య చరణ సేవలు దప్ప
మనసు శాంతి బొందు మార్గమరుదు 7

ధర్మవార్ధియైన దైవమ్ము పద సేవఁ
గర్మవార్ధి దాట గలుగు నావ 8

చేష్ట లుడిగినట్టి చెవి కన్ను ముక్కులు
నష్టగుణుని మ్రొక్కనట్టి శిరము 9

భవ మహా సముద్ర మా లీల యథవుని
పాద మందుకొన్న వారికెల్ల 10

# వ ర్ష మ హి మ



వాన గురియుచుండ వర్ధిల్లు లోకంబు
అందుచేత దాని నమృత మంద్రు 1

వాన కలుగఁజేయు ప్రాణి కోటికినెల్ల
కూడు నీళ్ళు రెండు కొఱఁత లేక 2

ఆకలి దహియించు, లేకున్నఁ వర్షమ్ము
జలధి దిరిగియున్న జగతినైన 3

మదకబట్టి దున్న మఱితురు రైతాంగ
మదను లోన వర్ష మల్ప మైన 4

పాడ జేయు పాడు పడినట్టి వారిని
బాగుజేయు వదియు వానయగును 5

వాన తొలకరింపఁ మానినచో పచ్చి
గఱికయుఁ దలఁజూపఁ పెఱుఁవేల 6

ఎత్తుకొన్న నీటి నివ్వనిచోఁ మబ్బు
మేటి సంద్రమైన లోటుఁ బడును 7

దేవ పూజలేదు దినకృత్యములు లేవు
వాన గురియకున్న వసుధపైన 8

తపముఁ జెడును దాన ధర్మంబు లుడుగును
నీరు జారకున్నఁ నింగి నుండి 9

నీరు లేకఁ జగతి నిలువగా దేరికి
నూర దూట వాన లుండకున్న 10

# ముక్తులు



తనదు ధర్మపథముఁ దప్పని ముక్తులఁ
బ్రస్తుతించు నెల్ల పుస్తకములు 1

యతుల మహిమ లెన్న మృతులైన వారల
నెంచి చెప్ప సాహసించినట్లు 2

కల్ల నిజములఁ గనుఁగొని సన్యసించిన
మునుల కీర్తి లోకమునకు వెలుఁగు 3

చిత్త మంకురముగఁ జేసి యైదింటిని
వణఁచు నతఁడు మోక్షమునకు విత్తు 4

నిగ్రహించుకొన్న నిష్ఠా గరిష్ఠుని
కమర ప్రభువె సాక్షి యంబరమున 5

చేయ దగ్గ పనులె చేతురు పెద్దలు
చిన్న లట్టిపనులు జేయఁలేరు 6

వినుట కనుట వంటి విషయమ్ము లైదింటి
నెఱుఁగు జ్ఞాని లోక మెఱిగి యుండు 7

ఋషులు జెప్పినట్టి విషయమ్ము లేనాఁడు
మంత్రములుగ నేడు మహిమఁ గాంచు 8

గుణము లనెడు కొంత గూర్చున్న వారికి
విలువ దాగ్రహంబు విముసమైన 9

కరుణ జూపువారె కష్టపెట్టకొకరి
బ్రాహ్మణులుగ జెప్పఁ బడెడువారు 10

# ధర్మోద్ఘాటన



ధనమువిచ్చు మోక్ష ధనము విచ్చును ధర్మ
మంతకన్న వలసినట్టి దేది? 1

ధర్మనిష్ఠ కన్నఁదగు మంచి లేదొండు
పీడ దానికన్నఁ గీడు లేదు. 2

చేయఁదగిన విధులఁ జేయుటే ధర్మంబు
ధర్మమెడలి బ్రతుకఁ దగవు గాదు 3

ఆత్మశుద్ధి కన్న నన్యధర్మము లేదు
మెప్పు కోసముండు మిగత వన్ని 4

ఈర్ష్య యాశ, కోప మెడలుటతోఁబాటు
ప్రల్లదములు లేమి పాడియౌను. 5

ధర్మమొకటె వచ్చుఁ దాఁ జనునప్పుడు
వేరు వాఁడు లెక్కఁ జూడఁదగదు. 6

పల్లకి నొకఁడెత్త పైనుండు నొక్కఁడు
ధర్మ మింతె యనుచుఁ దలచరాదు. 7

ఉన్ననాళ్ళు మరువకున్నచో ధర్మంబు
భవము వడ్డగించు బండ యదియె. 8

ధర్మమందె సుఖము తక్కిన దంతయు
సుఖముగాదు కీర్తి శూన్యమగును. 9

ఆచరింప వలసినట్టి దగును ధర్మ
మాచరింప రాని దగును నింద. 10

# గృహమేధి



కాపురస్థుఁడన్నఁ గాపాడగలవాఁడు
ముఖ్యమతని నమ్మి మువ్వురుంద్రు. 1

సాధు, పేద, దీను లాదిగ మువ్వుర
కండగాను గేస్తు డుండు నెపుడు. 2

పితరు, దైవ మతిథి పేదలు తానైదు
ధర్మములను గేస్తు తప్పకుండు. 3

నింద బడక నున్న దండటికిని బెట్టి
కుడుచు నతని గృహము కొఱతఁ వడదు. 4

నిర్మల మగుప్రేమ నీతియు నియమము
లున్న కాపురమ్ము వన్నెకెక్కు. 5

నీతితోడ నిల్లు నిలబెట్టు కొన్నచో
వన్ని వ్రతములందె యణఁగి యుండు. 6

క్రమము దప్ప నట్టి కాపురస్థుఁడు మేటి
ఘోర తపము జేయువారి కన్న 7

యుక్తరీతి ధర్మ యుక్తుడౌ గృహమేధి
యజ్ఞ యాగ ఫలము లనుభవించు 8

ధర్మ మనఁగఁ జెల్లు దాంపత్య భావమ్మె
మాట బిరమి వాని మంచి గుణము 9

బ్రతుక వలసినట్లు బ్రతికినచో నింట
మింట సురలు నిలచి మెత్తురతని. 10

# ఇల్లాలు



తగిన గుణము లుండి తన భర్త చేతిని
మిగులఁ బెట్టఁగలుగు మగువె భార్య. 1

పత్ని గుణము లేక ప్రఖ్యాతి యితరత్ర
నెంత యున్నఁ దన కదేమి ఫలము. 2

లేని దేది? భార్య జ్ఞానమ్ము గలదైన?
ఉన్నదేది? గుణము సున్నయైన? 3

స్త్రీల కన్నఁ గొప్పఁ జెప్ప నేమున్నది
చూపు మానమందు మోపిరేని 4

పతిని దైవముగను ప్రతమున్న యిల్లాలు
కురియు మన్న క్షణమె కురియు వాన 5

తనదు గౌరవమ్ము తన భర్త గౌరవ
మరసి కాచుకొన్న యామె భార్య 6

కంచ వాటి స్త్రీలఁ గనిపెట్టగా లేము
మాన మందు వారి మనసులేమి. 7

ధవుని సేవయందు ధర్మంబు దప్పని
సాధ్వి కమరలోక సౌఖ్యమబ్బు 8

పరువుఁ గాచునట్టి పత్నియే లేకున్న
వడత రీవిరాదు నపువురందు. 9

సాధ్వికిఁ దగినట్టి సంతాన మబ్బిన
మంగళముగ గృహము మహిమ గాంచు. 10

# బిడ్డలు



తెలియలేము మంచి తెలివైన బిడ్డలు
కలుగు దానికన్నఁ గలిమి పేరు. 1

ఏడు జన్మములకు నేదోష మంటదు
ఏహ్యపడని బిడ్డ లింటనున్న. 2

తన ధనమ్ము తండ్రు తన సంతతినె బుధులు
వారి వారి కర్మ వారి సుతులు, 3

కన్నబిడ్డ తనదు చిన్నారి చేతులఁ
దులపు కూడె యమృత తుల్యమగును 4

తనువు పులకరించు తాకినఁ దన బిడ్డ
మాటవిన్న చెవుల మధుర మగును 5

వారి వారి బిడ్డ గారాబు మాటలు
విన్న వినరు వీణ వేణురవళి. 6

బుధుల సభల యందు పొగడొందునట్లుగ
తనయుఁదీర్చు టగును తండ్రి ఋణము. 7

తనదు సుతుని ప్రతిభ తా మెచ్చుటకు ముందె
యుర్వి జనులు మెత్తు రుత్సవముల 8

కన్న నాటికన్న మిన్నగా నుప్పొంగు
తనయుని పొగడఁగ వినిన తల్లి 9

ఎట్టి తపముఁజేయ నిటువంటి పుత్రుండు
పుట్టె ననిన దీరు పుత్రు ఋణము 10

# ప్రేమ



తలఁపు తాళమేది విఱవంగ ప్రేమను
బాష్ప రూప మగుచుఁ బయలువెడలు　　1

దయఁదలంచు నరుఁడు తనువెల్ల వెచ్చించు
నదియు దన్ని తనకె యనుచు దలఁచు.　　2

జీవి కెటుల దనువు గావలె విఱవంగ
బ్రతుక వలయునన్న వలయు ప్రేమ.　　3

ప్రేమ యధికమైనఁ బెరవారు దమవారె
స్నేహమునకు నదియె చిహ్నమగును.　　4

అతని బ్రతుకుఁ జూడ నానంద మయమన్న
ఖ్యాతికెల్లఁ బ్రేమ కారణమ్ము　　5

పుణ్యమునకెగాక పురుషత్వమునకైన
వదల రాని దగును వసుధ ప్రేమ　　6

ప్రేమలేని వానిఁ బీడించు ధర్మంబు
ఎముక లేని ప్రాణి నెంత విధము.　　7

చవటి నేలఁజెట్టు చివురించనట్టుల
ప్రేమలేని బ్రతుకు పేలవమ్ము.　　8

అంతరంగమందు నమరనిచో ప్రేమ
బాహిరముల వలన ఫలమదేమి?　　9

జీవమునకు ప్రేమె జీవమ్ము యదిలేని
వారి దేహ మస్థిపంజరమ్ము.　　10

# ఆ తి థ్య ము



ఇల్లు గాచి ధనము వినుమడింపఁట యెల్ల
వతిథి నాదు కొనఁగ వగును జూవె. 1

అతిథి బయటనుంచి యమృతమే యైన దా
నారగింప న్యాయ దూరమగును. 2

ఆశ్రితాళి నెఱిగి యాతిథ్యమిచ్చిన
వందుచేత లేమి నొందదెవడు. 3

అతిథి రాక కలరి యాతిథ్యమిచ్చెడి
వారి యింట లక్ష్మి ఏలచి విలచు. 4

అతిథి తినఁగ మిగులు వన్నంబు దినువాని
నేల విత్తనంబు లేల జల్ల? 5

ఒకరి నుపచరించి నొకరికి నెదురొద్దు
వతఁడు దేవతాళి కతిథి యగును. 6

విందు యజ్ఞమగును వితరణ ఫలితమౌ
యర్థరహిత మింత యంత యనట 7

పెట్టలేవి వారె చెట్టు పుట్టల జేరి
యాళ లెడలి పట్టు లలమ టింత్రు 8

ఉండి యుపచరింపకుండెడి దారిద్ర్య
ముందు వజ్ఞులందె మెండుగాను. 9

అవిచమనెడు పుష్ప మాఘ్రాణమున వాడు
జూచినంత వతిథి లేచిపోవ. 10

# ఇంపు మాటలు



కల్మషమ్ము లేని కిమ్మని మాటలు
నిజముగన్న వారె నేర్చి యుండ్రు 1

నగుమొగమ్ముతోడ నయముగా మాటాడ
ఈవి కన్న దాని చేవమెండు. 2

విదిత ధర్మమగును వినిపింప ప్రేమతో
నగుమొగమ్ముతోడ నయముగాను. 3

బాధ పరమనట్టి పేదరికము బాపు
తీపిగాను జెప్ప దెలుసుకొన్న. 4

తొడవు లేల నుడుల దొణికిన మధురమ్ము
వినయ సంపదగల మనుజ తతికి. 5

పరుల మేలెఱింగి పలికిన పలుకులు
పాప మెడలజేసి చూపు నిష్కృతి 6

పలుకులందు మేలు కలుగంగ నయ్యది
గుణము దప్పకున్న గురుతరమ్ము. 7

ఎదిరి కసురులేని యింపైన మాటలే
యిహపరాల రెంట నిచ్చు సుఖము. 8

ఇంపుగ నుడువంగ నీడేరు సకలమ్ము
నింద బూతులేల బలుక వలయు? 9

ఇంపు మాటలుండ నేలకో పరుషోక్తి
పండువదలి కాయఁ బట్టినట్లు. 10

# కృతజ్ఞత



ఎట్టి ప్రతిఫలమ్ము నెదురుఁజూడకఁ జేయు
మేలె గొప్ప మన్ను మిన్ను కన్న. 1

కాలమెఱిఁగి జేయ గలిగిన మేలది
చిన్నదైనఁ జగతికన్న మిన్న. 2

ఆశలేక మేలుఁజేసిన గొప్పకు
సాగరంబు గూడ సమము గాదు 3

కొంచమైన మేలు కొండగా భావింత్రు
దాని మహిమ దెలియ దగినవారు 4

కొలతఁబట్టి మేలు గొలచుట సరిగాదు
గుణము నందె దాని గొప్ప కలదు 5

ఇడుములందు సాయపడినట్టి మైత్రిని
వీడఁరాదు మేలుఁ జూడవలయు. 6

ఆదుకొన్న స్నేహ మాపదఁ దొలగింప
జన్మజన్మములకు జ్ఞప్తిగలుగు. 7

మేలు మఱువరాదు మేనుండు నందాక
కీడు మఱపె పాడినాడు నాడె 8

తలకు మించి కీడుఁదలపెట్టు వాని దౌ
మేలు కొంత దలపఁ జాలి కలుగు 9

దేవినైన మఱపఁ దెప్పుడు బ్రతుకంగ
మేలు మఱచి బ్రతుక వీలుగాదు 10

# తా ట స్థ్య ము



పక్షపాత మెదలి వర్తించుచే న్యాయ
మందులోనె సౌఖ్య మమరియుండు 1

న్యాయపరుని సొమ్ము నాశమ్ము గాఁబోదు
తరతరాల వరకుఁ బెఱుగునద్ది 2

ఇంద్రపదవి బుధుల కెక్కువ గాదెన్న
ధర్మ పక్షమునకుఁ దగవిదైన 3

వారి వారికున్న వారసత్వమె తెల్పు
తగును తగదటంచు తథ్యముగను 4

కలిమిలేములెల్ల కలుగునవే గాన
బుధులు న్యాయపథము వదలరెందు 5

అంతరాత్మ న్యాయ మందించు చుండగా
చెవిని బెట్టకున్నఁ జెడు వతండు 6

తగ్గు తగ్గుగాదు తాటస్థ్యపరునికి
నెగ్గుగాను దలప రెపుడుగాని 7

తూచు కట్టువిధము తూగినచో బుద్ధి
బుధుల కదియె తగిన భూషణమ్ము। 8

మనసు మంచిగాదె మాటలన్నియు వచ్చు
మాట న్యాయమెల్ల మనసు విధము 9

వర్తకంబు పెరుగు వ్యత్యాస ముంచక
సొంతమట్లు పరుల సొమ్ముఁజూడ. 10

# అ ణ కు వ



అమరులందు జేర్చు నణకువ యొక్కవి
వడసు నందు ద్రొక్కు మిడిసిపాటు 1

ఊపిరున్న దనుకఁగా పాడు మణకువన్
కలిమికన్న దాని ఘనత హెచ్చు. 2

విద్య వినయమంచు విభుదుండు భావించి
మెలఁగుచుండు బ్రతుకు మెరుగు పడఁగ 3

ఉన్న ధర్మమునకు ఉన్నత గానట్టి
విగ్రహ పరుఁజూడ వింగి వంగు 4

అందఱికివి మంచి యణకువగా నున్న
మన్న వారి కధిక పన్నెఁదెచ్చు 5

కూర్మ మట్లుఁణచు కొనువాని పీ జన్మ
కేదు జన్మములకు తోదు సుఖము 6

వదలరాదు నాల్క వదలిన సర్వమ్ము
మాటఁజార భంగపాటు వచ్చు 7

మంచి మాటవన్న మర్యాద సర్వమ్ము
చెడ్డమాట నొకటి చెడును పూర్తి 8

అగ్గి గాల్చు మచ్చ లారును పూర్తిగాఁ
వన్నమాట మచ్చలార వెపుడు 9

కోప తాప మణచు కొనువాని క్షేమమ్ము
తవదిగానె జూచు ధర్మమెపుడు. 10

# న డ వ డి



ప్రాణమగును నడత ప్రాణమ్ము కన్నను
గౌరవమ్ము దాన గల్గు గాన — 1

తెలియఁదగిన దన్ని తెలిసియున్నను గాని
నడవడి సరిగామి నాణ్యమెదలు — 2

ఇంటి గొప్పదనము నెఱిగించు నడవడి
మంచి చెడుగు దాన నెంచదగును. — 3

మరచిన కృతులైన మరినేర్చు విప్రుండు
ఓగు పడిన యెడల బాగుపడదు — 4

లోభికెంత యున్న లాభమ్ము లేనట్లు
పైకిరాదు దుష్ప్రవర్తనుండు — 5

సత్ప్రవర్తనమున సజ్జనుల్ వర్తింత్రు
దుష్ట వర్తనమున దోషమెఱిగి — 6

మంచి నడతవలన మర్యాద హెచ్చును
తప్పు నడత వలన ముప్పు వచ్చు. — 7

సత్ప్రవర్తనంబు సౌఖ్యతా బీజమ్ము
దుష్ట వర్తనమ్ము దుఃఖకరము. — 8

అనుచితంబు జెప్పరాచార పురుషులు
మరుపు చేతనైనా మాటఁ మరచి — 9

లోకపోక దెరిగి పోకున్న వాడెంత
చదువు జదివియున్న జమవనల్లె — 10

# ప ర దా రా వి ము ఖ త



పరుల నాలిఁగోరు పాపమ్ము సద్ధర్మ
పరులయందు గానబడదు చూడ　　1

భ్రష్టులందు పరమ భ్రష్టుండు పరసతి
నాశజేసి సమయ మరయువాఁడు　　2

నమ్మినట్టివాని నాలిని గోరెడు
సఖుడు సఖుడుగాడు శవముగాని　　3

ఎంత వాడెయైన విసుమంతఁ జేయదు
పరసతులను గోరు పాపమున్న　　4

పరసతి సుఖమబ్బు పని తేలికైయైన
తీరరాని నింద జేరు నతని　　5

పగయు, భయము. నింద, పాపమ్ము నాలుగు
పరసతులను గోరువానితోడు　　6

క్రమము దప్పునట్టి గార్హస్థ్య ధర్మంబు
అన్య స్త్రీనిఁ గవయ నట్టి దగును　　7

కామ దృష్టి యన్య కాంతలపై లేమి
పురుష లక్షణమ్ము పుణ్యమగును　　8

జలధి పరివృతమగు జగమందు విఖ్యాతి
పరసతి భుజ బంధ మరయరామి.　　9

పాప కర్మలెన్నొ పనిగొని చేసినా
పరసతి యభిలాషఁ బడమి మేల్మి　　10

# ఓర్పు



త్రవ్వువారినైనఁ ధరమోయు పట్టులే
తెగడుచున్న నోర్వ తగునటండ్రు 1

కీడొనర్పు దాని కీడు జేయమి గొప్ప
మరచుటంతకన్న మంచి దగును. 2

బలిమిలోన బలిమి పగతుని మన్నింప
నతిథి కీడమి బీదలందు బీద 3

విందుదనము వీలొ నుండంగ నెంచిన
వదలకోర్పు భద్ర పరుప వలయు 4

మానికముగ గొండ్రు మన్నించు వానిని
ఆడిపోసు కొండ్రు రాత్రగాని 5

ఓర్వలేని వాని కొక్కనాడె తృప్తి
యున్నదమక కీర్తి యోర్చుకొన్న 6

చేయరాని తప్పు చేసిన వారికిన్
నీతి దప్పి శిక్ష నెఱపరాదు 7

ఆత్రపడిన వాని యన్యాయముల నెల్ల
నోర్పుచేత గెల్చు నుత్తముండు 8

ఆత్రగాని నోట నవదూరు మాటలు
వినుచు నోర్చుకొన్న మునుల సమము 9

వినుచు నూరకున్న వినరాని మాటలు
తపము జేయనేల నుపవసించి 10

# ఓ ర్వ లే మి



మంచివారటంచు మహిమీఁద బొగడొందు
క్రుళ్ళుబోతు తనము గూడకున్న. 1

అర్జనంబులన్ని యార్జించినట్టులే
లేవి యెడల యోర్వలేని తనము. 2

ధర్మమూరుడైన దైన్యుండు మాత్రమే
యున్న వారి జూచి యోర్వకుంట 3

చేతగాని వాడె నీతిగా బ్రతుకంగ
వొరుల సొమ్ముజూచి యోర్వకుంట 4

ఓర్వలేమి వలన నుత్పన్న మగుముప్పు
విజ్ఞులెఱిగి దాని విడచి యుంద్రు 5

వైరులైన మంచి వర్తింత్రు కిదెన్న
కాచియుండు క్రుళ్ళు కాటువేయ. 6

కూడు గుడ్డ లేక పాడౌను దనుదానె
యొరుల క్రియ జూచి యోర్వకున్న 7

క్రుళ్ళుబోతు వాని కొంపకు శ్రీదేవి
యడుగుబెట్ట మరచు వక్కనంపి. 8

లబ్ధమైన ధనము లబ్ధత బోవున
తప్పుదారులందు ద్రిప్పబెట్టి 9

క్రుళ్ళుబోతు మిగిలి కూర్చున్నదియు లేదు
మంచివాడు చెరుట మహిని లేదు. 10

# లోభము



పరులకున్న మంచి వస్తువు తనకని
కోరు లోభి చెడును కొంప మునిగి — 1

అప్పటి కగుదాని నాశించి నిందకు
పాలుపడరు ధర్మపరులు భువిని — 2

అల్ప సౌఖ్యమునకు నపహరింపగఁ బోరు
బ్రహ్మ సుఖము గోరు ప్రాజ్ఞులెల్ల — 3

పేదపడియునైన పెరసొత్తు నాశింప
డింద్రియముల స్థిమిత మెరుగు నతఁడు — 4

విద్యలందు సూక్ష్మ విషయమ్ము లెఱిగియు
లోభ ముడుగకున్న లాభమేమి. — 5

ముక్తి గోరుకొన్న మోహంబు ధనమందు
నెంతు దెచ్చిపెట్టు వెతల నన్ని — 6

పరుల సొమ్ముచేతఁ బెరగదు తన సొమ్ము
పెరిగెనేని తుదకు తరిగిపోవు — 7

ఉన్న సొత్తు తరుగకుండెడు మార్గమౌ
యొరుల సొత్తు కోర కుండు టగును. — 8

నీతికి నెలవౌచు నిర్లోభ నరులైన
వందితులను లక్ష్మి పలుకరించు — 9

లాభమేమి లేదు లోభమ్ము గూడిన
వైభవమ్ము దాని వదలుకొన్న. — 10

# చా టు మా ట లు



ధర్మపరుడటంచు తలయెత్తకున్నను
చాటుఁ బలుకదేని సజ్జనుండె 1

మంచి పలికి యెదుట మరుగున నిందించు
క్రూర కర్ముఁగీడు గూడియుండు 2

చాటుఁబలికి నిజము మాటు మఱుగఁజేసి
బ్రతుకు బ్రతుకు కన్న మృతి సుఖమ్ము 3

చెప్పవచ్చు నెదుట చెంపనదర గొట్టి
చేటుఁ దలఁపరాదు చాటు మాట 4

వారివారి ధర్మవర్తనం బెట్టిదో
చాటుమాటె దెల్పు క్షణమునందు 5

ఎదిరి గుట్టుఁజాట నెంచిన తోడనే
తనదు గుట్టు బయట తానె పడును 6

ఇంపు మాటలందు నిమిడిన స్నేహమ్ము
చాటు మాటలందు సమసిపోవు. 7

స్నేహితులకె చేటు జేసినన్ చాటుగా
పరుల యందు నింకఁ బలుకనేల 8

వెనుక నొకటి బలుకు పనికి మాలినవాని
ధరణి మోయునేమొ ధర్మమునకు 9

తప్పు లెఱిగినంత దనతప్పు దెలిసిన
మెరుగుపడును బ్రతుకు మీదమీద. 10

# వ్య ర్థ భా ష ణ



ఫలమొకింతఁ లేక వ్యర్థంబుగాఁ బల్కు
వట్టి వాని లక్ష్య పెట్టరెవరు. 1

వ్యర్థ భాషణమ్ము వ్యథనిచ్చు వంచించి
స్నేహితులకుఁ జేయు చెరుపు కన్న 2

వదురుబోతటంచు నెదిరికి దెలిపించు
వ్యర్థమైన దాని వ్యాఖ్యజేయ. 3

చెప్ప దొరఁగునేని చెత్తగా నేదేని
నష్టపడును వాని నాణ్య మచట 4

గొప్పదన మదెంత గూడిన వాడైన
భంగపడును వ్యర్థ భాషణమున. 5

సత్తులేక బలికి సామర్థ్యఁదనుకొన్న
పురుషుఁడెట్టు లగును పొల్లు గాని 6

దొడ్డవారి మాట దుడుకుగా నున్నను
పొల్లు మాట చెప్ప నొల్ల రొకటి 7

సత్తులేని మాట సర్వజ్ఞు లాడరు
పలికిరేని దాన ఫలిత ముండు. 8

సత్పథంబు గోరు శాస్త్ర పారంగతుల్
విష్పులముఁగ చెప్ప నేర రొకటి 9

పలుకఁ దలఁతువేని పలుకుము ఫలమీయ
ఫలము లేని పలుకు పలుక వలదు. 10

# అ ప కృ తి



క్రూర కర్ముఁడన్ని కృత్యంబులను జేయు
పాపమునకు వెఱచు పండితుండు. 1

ముప్పు వలన ముప్పు మూడును గాబట్టి
విప్పు నొవ్వు ముప్పు దప్పుకొనుము. 2

విజ్ఞతయన దన్ను వేధించు వారికిన్
చెరుపు జేయకున్న శిష్ట గుణము. 3

ఒకరి కీవు కీడు నొనరింపఁ దలచిన
దాని నీకు ద్రిప్ప ధర్మముండు. 4

ఏమి లేనివాడ నేనేమి జేసి న
న్నేమి యన్న వాని లేమి పూను. 5

చిక్కు లొరుల కెపుడు చేయని వాడైన
చిక్కులందుఁ దాను చిక్కకుండు. 6

దీర్ఘ వైరమునను దెరవుండు బ్రతుకంగ
దుష్ట కర్మవలన కష్ట మబ్బు. 7

అడుగు లంటి నీడ వడయాడు నట్లుగా
చెరుపు విడువ దెపుడు చెడ్డవాని 8

హాని జేయ వలసి దల్పంబు గానైన
దనకుఁ దానె రక్ష దలతురైన. 9

చెప్పవచ్చు నతఁడు చెడిపోఁడని రూఢి
చెరుపు పరుల కెపుడు చేయడేని. 10

# ఉ ప కృ తి



వాన కోరదేది వర్షించి వందుల
కుపకరించు వార లుందు రట్లు. 1

వివిధ వృత్తులందు విత్తంబు జేర్చుట
ఈయ దగినవారి కిచ్చు కొఱకె. 2

ఉపకృతి సరియగు నుత్తమ ధర్మంబు
భువిని లేదు మరియు దివిని లేదు. 3

ఉపకరించువార లున్నట్లుగా లెక్క
పాయ వడనివారు చచ్చినట్లై. 4

ఊరివారికెల్ల నుపయోగపడు నయ్యు
వుండినట్లై దాత కుండు ధనము. 5

మార్గ మధ్యమందు మాధుర్య ఫలవృక్ష
మున్న విధము దాతకున్న ధనము 6

సకల రోగములకు సంజీవి మూలిక
ధనము దాతకున్న క్షణము నందు. 7

దాతయైనవాడు దారిద్ర్యమున నున్న
మాన దుపకరించు మార్గ మతఁడు. 8

ఈయలేని సమయ మేర్పడినప్పుడే
దాత పేదనంచు దలఁచు నెల్ల. 9

ఉపకరింపఁ దనకు నపకారమే యైన
కూలిచేసి యైన గొనుము దాని. 10

# ఈవి



లేవరి కిడు దాని ఈవిగాఁ భావింత్రు
ప్రతి ఫలమ్మొ మిగత వన్ని జాడ. 1

అడుగరాదు మేలుకై యున్న నొకవివి
ముక్తి లేదటన్న యుక్త మీవి. 2

లేవరి యడుగంగ లేదని నొప్పింప
కిచ్చువాని దగును హెచ్చు కులము 3

సానుభూతి తగదు సాయంబు గోరెడి
ముఖము నందు నగవు మొలచు దనుక 4

శక్తివరుల శక్తి శమియించు టాకలి
దాని కన్న శక్తి దాని దీర్ప. 5

ఆకలనెడి నొప్పి యంచుకే చేరదు
పంచి తినెడు గుణము మంచుకొనిన. 6

ఈవి వలనఁ దృప్తి నెరుగునే ద్రవ్యమ్ము
కూడబెట్టి విడచి కుములు లోభి. 7

లేనివాని కిడక తనకు తానె తినుట
పరమ నీచమగును వస్తుకన్న 8

చావె కష్టమంద్రు లేవరి యడుగంగ
ఈయలేమి కన్న నింపె చావు. 9

దేహి యన్నవారి కాహార మిడుటయే
తనకు నెనుక మిగులు ద్రవ్యమగును. 10

# కీర్తి



ఇచ్చుటందు కీర్తి వచ్చుట కన్నను
ఫలిత మొండు లేదు బ్రతుకు నందు. 1

చెప్పువారు మిగుల జెప్పుకొందురటన్న
పేదవారి కిడిన పెద్ద తనమె. 2

మిగులు వట్టి దొకటి మేదిని సత్కీర్తి
యంతమగును మిగతవన్ని తుదకు. 3

నిలచెనేని కీర్తి కలకాల మిల మీద
నమరవరుల కన్న నధికు డతఁడు. 4

చావునందు కీర్తి శంఖంబునకు వోలె
ప్రాప్తమగుట గొప్ప పండితులకె. 5

వెలయ వలయు కీర్తి వెలయంగ లేకున్న
మనుట కన్న మంచి మరుగు పడుట. 6

కీర్తి లేనివారు కించపడుట మాని
దుష్టు డన్నవారి దూరనేల. 7

యశము తోడఁ బ్రతుక వశముగాకున్నచో
కర్మవశము వలన గలిగె నండ్రు. 8

కీర్తిపరులు పుట్టి మూర్తీభవించని
యట్టి నేల చవటి పట్టుగాదె. 9

బ్రతుకు కీర్తితోడఁ బ్రతికినవారిదే
కీర్తిలేని బ్రతుకు కీడమ్ము. 10

# క రు ణ



ధనములందు ధనము దయతోడ మండుచే
వ్యర్థునందు గూడ నర్థ ముండు. 1

కరుణ కన్న మంచి కానంగ లేమొక్క-
టాదరించు మతము లన్ని దాని. 2

కరుణ గల్గినట్టి ఘనులకు లేనట్టి
దంధకార మందు కుందు బ్రతుకు. 3

తనకు జరగదంచుఁ దలపోయగా నేల
పరుల యందు తాను కరుణఁ జూప 4

కరుణ కష్టములను కలిగింప దనుటకు
వాయుమండలమ్ము వసుధె సాక్షి. 5

కరుణ దొరఁగి మిగుల కష్టపెట్టినవారె
దుఃఖపడుదు రిపుడు తోడులేక. 6

ఇహము ధనములేక నింపొందగాఁ లేము
పరము కరుణలేక బడయలేము 7

అర్థ మెడలి మరల ననుభవింపగవచ్చు
కరుణ దొరగి మరల మెరుగుపడము. 8

కరుణలేక ధర్మ కార్యంబు జేయుట
బోధపడకఁ జదువు పొత్త మట్లు. 9

తన్న దలతువేని, తన్నులు దిన్నది
తలచుకొన్న కరుణ తానె వచ్చు. 10

# జీ వ హిం స



బలియ గోరి తాను బలిచేయు జీవుల
పట్టివారి కెట్టు లమరు కరుణ. 1

దాచపట్టి చేత ధన ముండనట్లుగా
మాంస భక్షణమున మరుగు కరుణ. 2

పేద మన్నవాని చిత్తంబు రీతిగా
మాంస భక్షకునికి మానసమ్ము. 3

జాలి యనిన ప్రాణి జంపమిలోఁ బాటు
మాంస భక్షణమును మానుటగును. 4

జీవహింస లేమి జీవిత ధర్మంబు
వంజా దారగింప నరక మబ్బు. 5

మాంస మెవరు దినక మానిన వారైన
నమ్మువారు భువిని నమ్ముగారె. 6

మాంస భక్షణమ్ము మానుట మంచిది
చింత జేయ వ్రణమె జీవి కద్ది. 7

జీవులందు నెల్ల జీవు డొక్కడె గాన
చంపు తినరుదేని సాధు జనులు. 8

వేయి యజ్ఞములను జేయుట కన్నను
చంపి తినక యున్న చాలు నదియె. 9

ప్రాణికోటి భక్తి భావాన వ్రణమిల్లు
ప్రాణ ఘాతకమును మాను వాని. 10

# త ప స్సు



బాధలెల్ల నోర్చి బాధింపకుండఁజే
తపముఁ జేయువారి తత్వమగును. 1

తపము తాపసులకె తనకును తగునని
వేషధారణమ్ము వెఱ్ఱి తపము. 2

తపము జేయువారి కుపచరింపగనేమొ
సన్యసింపరైరి సకల జనులు. 3

కాని వారిఁజెరుప నైనవారిని గావఁ
దలచినంత జేయ దగు తపస్వి 4

అనుభవింపవచ్చు ననుకొన్న రీతిగాఁ
దపము తప్పకున్న తథ్యముగను 5

తాపసాశ్రమము దప్పక వర్తింతు
రితరు లీషణముల మతి భ్రమింత్రు. 6

పుటముఁ బెట్ట బెట్టఁ బొల్పొందు బంగారు
బాధ పడమ పడమ బోధపడును. 7

తాను నేనటన్న దానిని విడనాడు
వతని గొల్చు జగతి నుతుల కృతుల 8

తపము దప్పనట్టి ధైర్యమ్ము గలవాడు
కాల యముని గూడ కాలదన్ను 9

లేనివార లధిక మైనట్టి హేతువు
వ్రతము సల్పువారు స్వల్ప మగుటె. 10

# బాహ్య వేషము



ధూర్తుఁడొప్పిదముగ మూర్తి రచించిన
అతని చేష్ట లెఱిఁగి యాత్మ నమ్ము. 1

పొగడనమ్ము తన్ను గగనమ్ము దాకంగ
నందులోని సత్య మాత్మ కెఱుక. 2

పొలము మేయునట్టి పులితోలుతో నావు
జనమునకు చేయు తీవ్ర తనము. 3

వలల నమ్మ విషము వ్యాధుండు పొదమంది
దుష్టుఁడాడి చేయు దొంగ తనము. 4

తెంపుకొనక నాశ సన్యాసి ననువారు
దిక్కు మొక్కు లేక తిరుగువారు. 5

నిగ్రహింప లేక నియమాత్ము లట్లుండు
వారికన్న ద్రోహపరులు లేరు. 6

ఎఱ్ఱని గురిగింజ కెట్లుండు నలుపట్లు
మంచివాని యందు మసి యొకింత. 7

మనము తేటగాక మాటిమాటికి నీట
మునిఁగి లేచు జనులు మూల మూల 8

ముడుకు బాధనిచ్చు ముచ్చటగా మంచి
పీట ముదమునిచ్చు కోతియయ్య 9

గొరగ వద్దు పెంచుకొనఁగ వద్దు జగతి
దోసమన్న దాని త్రోసివచ్చు. 10

# దొ ం గ త న ము



బ్రతుకఁదలఁతువేని పరిహాస పడకుండ
మరిని దొంగతనము మరచిపొమ్ము. 1

దొంగిలింపకున్న దొంగిలించిన యట్లె
యట్టి తలపు మనమునందు గలుగ 2

పెరిగినట్లు పెరిగి పెరిగిన దంతయుఁ
తరిగిపోవు దొంగతనపు ధనము. 3

చోర బుద్ధి వచ్చి చొచ్చుకపోయిన
బ్రతుకు కాలమెల్ల పతన మగును. 4

జాలిగుండె కలుఁగ జాలదు చిప్పింప
దుష్టబుద్ధి కలుఁగ దొంగిలింప. 5

నీతిగాను బ్రతుకఁ జేతగా దొకనికి
యాశ గలిగెనేని మోసగింప 6

చిక్కనముగ బ్రతుక చేతైన వానికి
నపహరింప దలఁచు నెపము లేదు. 7

మేర నెఱుఁగు నతఁడు మీరడు ధర్మంబు
ఘోర నెపమునందె చోరుడుండు. 8

చోర వృత్తికన్న నేరెఱుంగని యట్టి
నిరపురుగు చెడును శీఘ్ర గతిని. 9

దొంగవాని కిహమె దూరమై పోవంగ
నిగ్రహానికి దక్కు నింగి సుఖము. 10

# స త్య ము

సత్యమేదియన్న స్వల్పమ్ముగా నైన
దోషముండ నట్టి భాషణమ్ము. 1

సత్య దూరమైన సత్యంబుగా నొప్పు
దోహదంబుగాగ దోషముడిగి. 2

మనసు తెల్పు దాని మరుగుపఱచు వాని
చిత్తమందు సతము చిప్పరగులు 3

అనృత మాడకున్న నాత్మసాక్షిగఁ దాను
మసలు సకల జనుల మనసు లందు. 4

సత్యదృష్టి యాత్మ సాక్షాత్కరించిన
యజ్ఞకర్త కన్న విజ్ఞుఁ డతడు. 5

నిజముకన్న కీర్తి నిక్కరిణి లేదొందు
కష్ట రహిత మన్ని నిష్ట లందు. 6

నిర్వహించినట్లె సర్వ ధర్మంబులు
నిజము నిజముగాను నిలుపుకొన్న 7

అంగశుద్ధి స్నానమాడిన సరిపోవు
నాత్మశుద్ధి సత్య మందుటందె 8

వెలుఁగులన్ని వెలుఁగు వెలిగింపజాలవు
సజ్జనాళి వెలుఁగు సత్య మగును. 9

అరయ సత్యమొకటె పరమార్థమైనది
సత్యమునకు సాటి జగతి లేదు. 10

# కో ప ము



చెల్లు నెడలనైన చెల్లింపకుండుచే
కోపమణఁచుకొన్న గుణమనంగ 1

అనువు గానిచోట నాగ్రహించుట (వెఱ్ఱి)
పంత కన్న నేర మనువు చోట 2

కోప మెవరి యందుఁ జూపుట సరిగాదు
కష్టములకు నదియె కారణమ్ము. 3

మనసు కుములఁ జేయ మందహాసముఁ దీయ
ఆగ్రహంబె శత్రువగు నిజంబు. 4

కోరనేల రక్ష కోపముడిగెనేని
కోరనేల శిక్ష కోపమున్న 5

ఆగ్రహంబు కాల్చు నైనవారిని దన్ను
అంటుకొన్న వరకె మంట కాల్చు. 6

ఆగ్రహమున కార్య మగునని దలచుట
బండను తనచేత బాదినట్లు 7

నిప్పు పెట్టినట్లు నొప్పించు చుండిన
నాగ్రహింప వలవ దట్టి యెదను. 8

లేశమైన మదిని లేకున్న కోపమ్ము
సకల మతని కడకు సాగివచ్చు 9

కోపగాడు మృత్యు కూపంబులోబడు
శాంతపరుఁడు మోక్ష సౌధ మెక్కు. 10

# దుష్కృతము



సకల సంపదలను సమకూరుచే యైన
నార్యులెల్ల రకృత మాచరింప 1

కంటబెట్టి యొకఁడు కలిగించగా కీడు
బదులు జేయఁగోరు బుధులు దాని 2

నీవు జేయకున్న నీకెగ్గు జేసిన
బదులు జేయుటయును బాధకరమె 3

చెడ్డ జేసెనేని సిగ్గు పడగవాడు
మంచి చేయుటగును మహిత శిక్ష 4

ఆత్మ కష్టమట్లు నన్యుల కష్టాలు
తెలియ లేనివాని తెలివి తెలివె? 5

బాధ యగు నటంచు బోధపడిన వెన్క
ఒరుల కట్టి బాధ నొసఁగ నేల? 6

ఎప్పు డెవ్వరికిని యెంత మాత్రమ్మును
చెరుపు దలపకున్న శిష్ట గుణము. 7

తనకు దెలియుగాదె తనబాధ యెట్టిదో
యెదిటి బాధలెందు కెఱుగలేడు. 8

నేడు నీవుజేయు కీడది నిన్నంటి
స్వయముగానె రేపు వచ్చి చేరు. 9

బాధలేని బ్రతుకు బ్రతుకంగ నెంచిన
బాధ బెట్టకుండా బ్రతుక వలయు. 10

# అహింస



ధర్మములను పరమధర్మ మహింసయే
యన్ని ధర్మములకు హాని హింస 1

ప్రాణికోటికెల్లఁ బంచి కుడిచెడు దాని
పరమధర్మ మనిరి ప్రాజ్ఞులెల్ల 2

నిరుపమాన ధర్మ నిష్ఠయౌ యహింస
సమము దానివెనుక సత్యమగును. 3

మంచి మార్గ మొకటి మహిమీద గలదన్న
జీవహింస లేని భావమొకటె 4

బ్రతుకు ద్రోపిపుచ్చి యతులౌట కన్నను
మేలు హింస విడచి మెలఁగు టెంతొ 5

జీవహింసలేక జీవించు నవ్వాని
కాలయముడు గూడ కనికరించు 6

ఆత్మరక్షకైన వన్యజీవులఁ జంపు
దుష్కృతమ్ము పరమ దోషమగును 7

అంతులేని భోగ మనుభవించుటకైన
యోగధనులు హింస నొప్పుకొనరు. 8

హింసపరులు పరమహంసల సన్నిధి
నీచ మానవులుగ గోచరింత్రు. 9

ప్రాణఘాతకులుగ పరిణమించిన వారె
తీరవట్టి వ్యాధి దిరుగువారు. 10

# సన్న్యాసము



దేని దేని నుండి దేనిని విడనాడు
దాని దాని నుండి తనకు ముక్తి 1

ఉన్నవన్ని వదలఁకొన్నట్టి వారల
కపరిమిత సుఖమ్ము లనుభవదురు 2

పట్టిపెట్టుకొనుము పంచేంద్రియమ్ముల
వదలిపెట్టవలయు వస్తుచయము 3

సర్వమెరలు అగును సన్న్యాస నియమమ్ము
మిగిలెనేని యొకటి తగులు నన్ని 4

పుట్టునందె రోత పుట్టిన వాటికి
వలసినట్టి దేది వసుధ లేదు. 5

నేను నాదటన్న దానిని విడనాడ
సురుల కలవిగాని సుఖము దక్కు 6

పట్టు విడువకుండు పట్టిన కష్టాలు
పట్టు విడువ కాళ పట్టుకొన్న 7

వదలిరన్ని మోక్ష పదవికి సన్న్యాసు
లన్య జనుల దగిలి రాళలందు 8

తెంపుకొన్న వాళ తెగిపోవు పట్టుక
యుష్టిరంబు లాళలందు గలవి 9

ఆశ్రయింప వలయు వాళలు దీరంగ
వాళ లేనివాని నాశ్రయించి 10

# తత్త్వార్థము



సత్తు కానిదెల్ల సత్తను నజ్ఞాన
కారణంబె జన్మ కారణంబు. 1

అంధకార మెడలి యనువగు సౌఖ్యము
మౌర్ఖ్య మెడలి నట్టి మానవులకు. 2

అజ్ఞతన్ దొలంగి విజ్ఞతన్ స్థిరపడ్డ
చేరువగును మోక్షసీమ తనకు. 3

ఐదు గెల్వగల్గి యాత్మానుభూతిని
పొందలేని యెడల పుణ్యమేమి 4

దేనితత్త్వ మెట్టిదైనను నిజతత్త్వ
మందు గనుటె జ్ఞాన మగునటంద్రు. -- 5

తాత్త్వికముగ నిజము దరచి చూచినవారి
మనసు మోక్షమార్గ మనుసరించు. 6

తత్త్వచింతనమున తత్త్వంబు దెలిసిన
తిరిగి పుట్టనట్టి స్థితి లభించు 7

పుట్టి గిట్టునట్టి బుద్ధిహీనత బాపి
మోక్షమిచ్చు బుద్ధి బుద్ధి యగును 8

ఏది సర్వమునకు నాధారమో దాని
పట్టుకొన్న పుట్టు బాధ లుడుగు 9

కామక్రోధ లోభ కర్మల నామమ్ము
చెడిన చెడును వచ్చుఁ జెడుగులన్ని. 10

# ఆశ



ఆశ సర్వ జీవరాశికి జీవనమ్ము
వెలయ జేయునట్టి విత్తనమ్ము. 1

కోరదలంతువేవి కోరుము పుట్టమి
దానిఁ గోర నాశ మానవలయు 2

ఆశలేమి కన్న నైశ్వర్యమే లేదు
నేలపైన మరియు నింగిలోన 3

సుద్దమెల్ల యాశ శూన్యమై నప్పుడే
సత్యవ్రతుల కద్ది సాధ్యమగును. 4

సన్న్యసించుటన్న సంకల్ప రాహిత్య
మున్న గృహము వదలుకొన్న గాదు. 5

ఆశ లెవరి నైన మోసగించును గాన
దానియందు భయమె ధర్మమగును. 6

ఆశలంత దెగిన నడుగకుండనె తపః
ఫలములన్ని లభ్యపడు నిజమ్ము. 7

ఆశ లేనివాని కగచాటు కలుగ
వున్నవాని కుండు నన్ని వెతలు 8

కష్టములకు కష్టకారణంబైనట్టి
యాశ దొలగ దొరకు నమిత సుఖము. 9

మేరు వారిగనేని తీరని తృష్ణకు
దూరమైన ముక్తి చేరువగును. 10

# విధి



కలసివచ్చువేళ కార్యంబు దోచును
కలసిరాని వేళ నలసు దోషు 1

పేదపడఁగ బుద్ధి పెడదారి ద్రొక్కును
బాగుపడగ నదియె పదును దీరు 2

చదువవలసినంత చదివియున్నను గాని
బుద్ధి విధిని బట్టి పోవుచుండు. 3

సృష్టి ద్వివిధమగును శ్రీవేరు ధీవేరు
వేరు బాటు కెల్లఁ విధియె నాంది. 4

గుణముగాని వన్నె గుణహాని, గుణమును
గుణము గాకపోవు ధనము వంద. 5

రానివేళ రాదు రమ్మన్న నేదియు
వచ్చువేళ పోదు వలదటన్న. 6

ఇచ్చునట్టి వాని యిచ్చకు మారుగా
నేది ననుభవించ కాదు జూడ. 7

సన్న్యసింపకుంట సాగని వారెల్ల
విధియె కారణంబు వేరుకాదు. 8

ఇష్టమైన నంతసించెడి వారలు
కష్టమైన నేడ్వగాదు విధికి. 9

విధి దెలియ మగును విడువదు తప్పుకో
నెందుబోవ వచ్చి ముందు నిలుచు. 10

## రా జు



కలిమి, బలిమి, చెలిమి, కావు, దుర్గము, మంత్రి
చక్రవర్తి కంగషట్క మగును — 1

నిర్భయమ్ము, ఠీవి, నిర్మలజ్ఞానమ్ము,
పట్టుదలయు నాల్గు ప్రభున కుండు — 2

అప్రమత్త తెలుక నార్జవ మిమ్మూరు
మనుజ పతికి వలయు గుణము లంద్రు — 3

ధర్మయుక్తమైన దండన, శౌర్యమ్ము
మాన మంచు నెంచు మహిత విభుఁడు — 4

దాడిసలిపి వలయు ధనము సంపాదించి
దాచి, కాచు నృపుని దక్షుఁడంద్రు — 5

చూడ సులభుఁ డగుచు సున్నితముగ బల్కు
భూపశ్రేష్ఠు నెందు బొగడు జగతి — 6

రోజు తప్పకుండ పూజింత్రు ప్రజలెల్ల
మృదుల ఫణితి నాదను మేదినీశు. — 7

క్రమముతోడఁ బ్రజలఁ గాపాడు నృపవర్యు
దైవము గనె ప్రజలు దలఁతు రెల్ల — 8

తన్ను దప్పు జెప్పుచున్నను జెవియొగ్గు
మానవేంద్రు ఠీద మహి వెలుంగు — 9

దక్షతయును, దాన, ధర్మంబు, దయ నాల్గు
గలిగి యున్న నృపుల వెలఁగతందు. — 10

# వి ద్య



అభ్యసింప వలయు నవివేకమును బాయ
నాచరింపవలయు నవ్విధంబె. 1

అంకె యక్షరంబు లగు రెండు కన్నులు
వలయునండ్రు బ్రతుక వలయు నన్న 2

కన్ను లున్నవన్న గాదనినే విద్య
కండ్లు పుండ్లె విద్య గఱపకున్న 3

మోద మొదవ గూడి ఖేదమ్ముతో బాయు
ప్రతిభ గల్గు వృత్తి వందితునకె 4

అణఁగి మణఁగి విద్య నార్జింపవలె నెల్ల
నున్నవారి చెంత నొదిగి యట్లు. 5

చల్లినంత చెలమ జలమూరునట్లుగా
చదివినంతఁ దెలివి జనులకుండు. 6

చదివినట్టివారు సర్వత్ర పొగడొంద
చావు మూడుదాక జదువరేల? 7

ఒక్క జన్మయందు నొదిగి నేర్చిన విద్య
యేడు జన్మములకు నిచ్చు సుఖము 8

తనవలె నినువారు తవియంగ గని విద్య
వదలలేక బుధుడు వలపు గొనును. 9

విద్య తరుగవట్టి విశ్రుత ధనమౌను
దారవోవు మిగత ధనము లన్ని. 10

# అ వి ద్య



జూదమాడినట్లు చదరంగ మదిలేక
చదువు కొనక వాడు సలుపు పెల్లి — 1

విద్య లేనివాఁడు వివపింపఁ గోరుట
సౌఖ్య మిచ్చినట్లు స్తన విహీన. — 2

చదువురాక యున్న చదివినట్లే యగు
పండితాళి ముందు బలుకదేవి — 3

చదువు లేని వాని శాస్త్రజ్ఞు లొప్పరు
తెలివితేట లెన్ని గలిగియున్న — 4

చదువురాని వాని సామర్థ్య మంతయు
రంగ మెక్కి నంత భంగపాటె — 5

చపటివేల విధము చదువని వారుంట
మదర పోషణార్థ ముర్వీమీద. — 6

విద్య లేని వాని వింతపోగసు జూడ
మట్టిబొమ్మ కొలువు బెట్టినట్లు — 7

జ్ఞానపరుని లేమి పూమట కన్నను
మూర్ఖు వద్ద కలిమి ముప్పు దెచ్చు — 8

అగ్రజన్ముడైన నభ్యసింపని వాఁడు
విమ్మజుండె యెన్ని నేర్పు లున్న — 9

ప్రజల పంచలందు పశువులుండెదు మాడ్కి
చదువు రానివాడు జగతి మంట. — 10

# వి ను ట



సంపదలను భూరి సంపద శ్రవణమ్మె
యన్ని సంపదలకు నధిక మదియె. 1

కర్ణములకు విందు కలుగ నప్పుడు జూచి
కడుపున కిడవలయు కవళ మింత 2

వినెడువారు భువిని వీనుల విందుగా
వేల్పు సములు గాగఁ వెలయు చుంద్రు 3

చదువకున్న నైన చదువంగ వినవలె
నొరుగు నప్పు డద్ది యూతయగును. 4

ఊతకఱ్ఱ విధము నొరగనీయని రక్ష
పెద్దలైన వారి బుద్ధి వినిన 5

చిన్న విషయమైనఁ జెవియొగ్గి విన్నచోఁ
విన్నవఱకు మంచి వెలయుచుండు 6

విన్న దానియందు విషయమ్ము లేకున్న
గొప్పవారు దాని జెప్పరెత్తి 7

వీనులనఁగఁ జెల్లు వినదగ్గవే విన్న
చెడుగు విన్నఁ జెవులు చిల్లులగును 8

శ్రద్ధగాను వినని దద్దమ్మ లెవ్వరు
వినగఁ జెప్పలేరు వినయ మొప్ప 9

వినగ నేర్వ కొకఁడు తిన నేర్చుకొన్నచో
పుట్టనేమి వాఁడు గిట్టనేమి. 10

# జ్ఞానము



నాశనమ్ము రాఁ బోషించు జ్ఞానమ్ము
సాధ్యపడని కోట శత్రువులకు. 1

పోవునట్టి వ్యర్థ పోకడఁ బోనీక
చక్కదిద్దు నదియె జ్ఞాన మనిన 2

ఎవ్వరెవరి నోట నేమాట విన్నను
దాని మర్మమెఱుగ జ్ఞానమగును. 3

చెప్ప వేర్చి, యెదిరి చెప్పిన దానిలో
సత్య మెఱుగు టగును జ్ఞానమ్మనిన 4

పొంగిపోక వ్యధల కుంగక లోకంబు
ననుసరింప జ్ఞాన మగున టండ్రు 5

పలువు రెట్లు జగతి వర్తింత్రు తానట్లు
తెలిసి బ్రతుకు టగును తెలివి యన్న 6

జ్ఞాను లెఱుగ గలరు దేనినైనను ముందె
సర్వ జనుల కద్ది సాధ్య పడదు 7

లొంగ దగిన చోట లొంగుటే జ్ఞానమ్ము
మూర్ఖుఁ డెదురు దిరుగు ముప్పుఁగనక 8

ముప్పుఁ దెలుసుకొండ్రు ముందుగా జ్ఞానులు
వారి నెదుర నెవరి వశము గాదు 9

జ్ఞానమొక్కటున్న సర్వస్వ మున్నట్లె
యద్ది శూన్యమైన నెద్ది మిగులు. 10

# దోష నిరోధము



గర్వ మాగ్రహమ్ము కలుషమ్ము నిమ్మూఁడు
మృగ్యమైన వృద్ధి పొందు నతఁడు. 1

స్వాతి శయము నల్పసంతోషము నపాత్ర
దానము నివి తగవు ధరణి పతికి 2

కొంచమైన నెపము కొండగా భావింత్రు
నింద కోర్వనట్టి నీతిపరులు 3

దోషకృత్యములకు దూరమ్ము గాకున్న
నంతరంగ శత్రువదియె మనకు 4

రాక ముందె జాగరూకత లేకున్న
బ్రతుకు నిప్పుదగ్ధ వామి నొప్పు. 5

దోష రహితుఁ డగుచు దుష్టుల దండింప
తప్పుగాదు చూడ ధరణి పతికి. 6

లోభి గుణమె చాలు లోకమం దున్నట్టి
మంచితనము నెల్ల మంటగలుప 7

దోషమందు గొప్ప దోషమ్ము లోభత్వ
మీడు జేయ దానికేది లేదు. 8

హీన మెట్టి వారి కైనను స్వోత్కర్ష
మానుమల్లె మేలుగాని పనులు 9

ఇతరు లెఱుఁగ నటుల నీప్సితార్థములందు
సిద్ధహస్తు నెదిరి జెఱుప గాదు. 10

# సాధు సాంగత్యము



ధర్మ వర్తనమున తనకన్న పెద్దల
గుర్తుబట్టి స్నేహ వర్తిగమ్ము — 1

పడెడి బాధ బాపి పడనుండు బాధను
బాపువారి చెలిమి బడయ వలయు — 2

అధిక లాభమెంచి ఆసలను పోగొట్టు
లోభిబుద్ధి బుధులంబోవ లేదు — 3

ఘనుఁడటన్న దగును దనకన్న పెద్దల
బాంధవమ్ము బడయ బల్మియున్న — 4

దీర్ఘ దర్శు లెఱుగు మార్గంబె లోకమ్ము
వారి పొందు వలయు వసుధ పతికి. — 5

క్ష్మతలేంద్రు పభమ సమయజ్ఞు లున్నచో
శత్రు బలము లెవ్వి సాగ కుండు — 6

కొట్టి తిట్టి చెప్పు గుణవంతులను గూడు
వారి జెరుప నెవరి వశము గాదు — 7

చారవుజేసి చెప్పు గురువులు లేకున్న
తనకుఁ దానె చెడును ధరణి విభుఁడు — 8

మొదలు లేక లాభ మొదవదు బేరమ్ము
చెప్పువారు లేక స్థిరత రాదు — 9

వెదకి దెచ్చుకొన్న విధమౌను బంగరు
బుద్ధి జెప్పు వాకవి వద్దటన్న — 10

# దుర్జన సాంగత్యము



పెద్దఱికము వెలచు బుద్ధిహీనుల గూడ
చిన్నరికము వారి జేయఁ గలవు 1

నేల నంటి యుండు నీటిరంగున బోలు
కూడు వారినంటి గుణములుండు 2

చిత్తమందె దోచు నుత్తమ గుణరాశి
స్నేహమందు వెలిగి చిగురువేయు 3

మంచికెల్ల జూడఁ మనసె కారణమైన
చెలిమిలోనె దాని జెప్ప వలయు 4

చేరిక యెటులుండు చిత్తమట్లుండును
చిత్త మెట్లొ యట్లు చేష్టలుండు 5

సజ్జన సహవాస సంపర్కముల వల్ల
మనసు మంచి మార్గ మనుసరించు 6

చిత్తశుద్ధి మోక్షసిద్ధికి మూలమ్ము
స్నేహశుద్ధి సకల శ్రీలవిచ్చు 7

ఆత్మశుద్ధి మున్న నాచార్యులకునైన
సంఘ శుద్ధి వలన సర్వసిద్ధి 8

మనసు మంచిదైన మరుజన్మకును మంచి
మించు నింక చెలిమి మంచిదైన 9

మంచివారి గూడ మంచి మంచమునెక్కు
చెడ్డవారి గూడఁ జెరుపె మిగులు 10

# కర్మకౌశలము



చెడుటఁ బాగుపడుట చింతించి మొదలంట
జేయ వలయు వెనక చింతవలదు 1

తెలిసి నట్టివాని కలసి లెక్కించి తాఁ
బానునేవి కలసి రాని దేది 2

వెనుకనేదో వచ్చు ననుకొని యున్నది
జారఁ విడచు కొనరు జ్ఞానులెల్ల 3

మానమునకు జంకు మహనీయు లెల్లరు
దప్పిదములు జేయ నొప్పు కొనరు 4

పట్టుగానకుండ పనిజేయఁ బగతుర
నారుపోసి పెంచు తీరునుందు. 5

కాని దానిజేసి కాకుండఁ జెడిపోవు
నైన దాని జేయఁ మాని చెడును. 6

దేవినైన దీర దెలిసియే జేయుము
పిదప జూతుమనుట వెఱ్ఱితనము. 7

చేతఁగాకఁ జేయు చేతల కెందఱు
పూని సాయపడిన పూర్తిగాదు 8

మంచి జేయఁ జెరుపు పొంచి ముంతుక వచ్చు
నెవరికేది చేయ నెఱుఁగకున్న 9

సంప్రదాయమునకు సడపడు సమలనే
నిర్వహింపవలయు నిందలేక 10

# బ లా బ లి మి



పని దొరంగ దాని పాటెంతొ బలమెంతొ
పగయు చెలిమి జూడఁ ఫలితమున్ను. 1

తనకు తగిన దానిఁ దగనెంచి చేసిన
చెల్లుచుండు తాను జేయు పనులు. 2

ఉన్న శక్తి దెలియ కుత్సాహులై జేయ
భంగపడినవారు పలురు గలరు. 3

తన బలమ్మె చాల నమకాని గర్వించి
తిరుగు నతఁడు చెడును త్వరిత గతిని 4

తేలిక యని నెమలి తూలికలను బండి
నిండవేయఁ నిరుసు మొండి యగును. 5

కొంత కొంత యనుచు కొమ్మకొనకు జేర
కొమ్మ విరిగి నంత కూలిపడును. 6

దానమైన నున్న దానిని గుర్తించి
చేయువాని సిరికిఁ జెడుపురాదు. 7

తప్పులేదు పరవు దగ్గిన మాత్రాన
పెప్పుపెరగనట్టి వెచ్చమున్న 8

లెక్కలేక బ్రతుకు నొక్కని కెంతున్న
మన్న దున్న తీరె మన్న యగును. 9

ఉన్న దెంతొ దెలియ కుపకార మొనరించ
నంతరించు శ్రమ మెంత యున్న. 10

# కాలము



పగటివేళఁ గాకి పగదీర్చు గూబపై
వేళ నృపతి కల్లు విడువ గలది **1**

అదను నెఱింగి కార్య మాచరించిన జాలు
ధనము మూటగట్టి దారమదియె. **2**

సమయ సాధనముఁ గమనించి చేసిన
సాధ్యపడని దొకటి జగతి లేదు. **3**

స్థాన మెఱిగి రాజు సమయమ్ము గుర్తించి
యాచరింప వసుధ హస్తగతము. **4**

వేళజూచు చంద్రు డెక్కిన నరకుండ
నెందరంచువారు నేల నెల్ల. **5**

సాధకుండు పొంచి సౌఖ్యంబుగా మంట
తగరు పొంచి నెదిరి దాకు విధము **6**

బయట బెదరు జ్ఞాన వరులెల్ల తక్కిన
నాత్మ మంచి కాల మనుసరింత్రు. **7**

కాలమొకటి వచ్చుఁ గార్యమ్ము సాధింప
వేచియుండవలయు వేళ నెఱిగి. **8**

సాధక మగునపుడె సాధింపవలయును
సాధ్యపడున దెల్ల సత్వరముగ **9**

కొక్కెర వలె రాజు చిక్కిన సమయమ్ము
శత్రువులను బట్టి చంపవలయు. **10**

## కార్యనిర్ణయము



మంచి చెడ్డ లరసి మంచి జేసెడి వారె
వలయు కార్యమునకు బలముగాను 1

వృద్ధిఁ బఱచి సొమ్ము విఘ్నంబులకు నోర్చు
స్థిమిత పరుఁడె కార్య సిద్ధిపరుఁడు. 2

తెలివితేట యుండి తెగువుండి పేరాశ
లేని వాఁడె చేరనైన వాఁడు. 3

తెలివితేట లెన్ని గలిగిన వాఁడైన
కార్యకర్త లవఁగ గాదు పఱ 4

సవితమ్ము దెలిసి ప్రతిబంధముల కోర్చు
సాహసుండె కార్యసాధకుండు 5

ఎవ్వరెవరు దేని నే విధి సాధింత్రు
దాని జేయ నిమ్ము వాని బిలచి 6

చేయువారి తరము చేష్టల తరమును
కాల తరము దెలియ కార్యమగును 7

దాని వాని పనికి దాని వానిని జూచి
యప్పగింప కార్య మగును సూవె 8

కార్య సూరు చెలిమి గౌరవింపని యట్టి
సంశయాత్ము విడచిఁ జనును లక్ష్మి 9

ప్రతిదినమ్ము రాజు పనివారి క్షేమమ్ము
నడిగి తెలుసుకొన్న జెడదు వసుధ. 10

# చుట్టరికము



లేమి యున్న జేర్చి ప్రేమను పాటించు
వారివలన బంధువర్గ ముండు — 1

చుట్టరికము ప్రేమ బుట్టుకొన్నదియైన
బహువిధాల లాభప్రాప్తి నిచ్చు — 2

బంధుప్రీతి లేని బ్రతుకెంతగా నున్న
కట్ట తెగిన చెరువు పట్టు విధము — 3

బంధు వర్గమునకు పొందికగా నున్న
కలిమి మిగిలి నంత ఫలము గలదు — 4

ఇచ్చి ప్రియము తోడి నింపుగా మాట్లాడు
నట్టివాని చుట్టు చుట్టరికము — 5

దాతయయ్యు కోపతాపమ్ము లేకున్నఁ
జుట్టరికము లేనిచోటు లేదు — 6

కాకి ముట్టదేది కలియక దనవారి
నట్టి వారికుండు నదియె కలిమి. — 7

ఎల్లర నొకరీతి యేలిక చూడడు
చూపు ననుసరించి చుట్టముండు — 8

బంధు వైరమున్న, పొందిక నద్దాని
కారణమ్ము దెలియ దీరిపోవు — 9

కారణమ్ముఁ దెలిపి చేరదీయవలయు
వదలుకొన్న వాఁడు వచ్చి చేర — 10

# మ ఱ పు



ఆగ్రహంబు కన్న నధికమౌ నేరమ్ము
సంతసమున మఱపు సంభవింప 1

మందగించు బుద్ధి మనుజుండు పేదైన
మఱపు చేత కీర్తి మందగించు 2

మాసిపోవు కీర్తి మఱపున్న వారికి
శాస్త్ర ధమలకైన సత్యమిద్ది 3

భద్రమగునె కోట భయమున్న వానికి
మఱచు వాని కెట్లు మంచి గలుగు. 4

వచ్చు వెతల దెలసి వారింప మఱచిన
చిక్కులందు జిక్కి చింతఁ జెందు. 5

ఎంత కార్యమున్న నేకాలమువగాని
మఱపులేని వాని మహిమె మహిమ. 6

జ్ఞాపకమను గొప్ప సాధన సంపత్తి
కలుగువాని కేది కాదు జగతి. 7

మెప్పు నిప్పు పనుల మఱ్ఱింగి జేయక
మఱచువాని కెపుడు మంచి రాదు 8

సాగుచున్న నాఁడు జదువుము, మఱపుచే
కష్ట పడిన వారి గాథ లెల్ల 9

వలపి నట్టిదాని వదలక జింతింప
వలపినట్టి దదియె వచ్చి చేరు. 10

# దండనీతి



బంధుమిత్రు లనెడు పక్షపాతము లేక
మండదగిన దగును దండనీతి. 1

మబ్బు జూచి బ్రతుకు మహిజీవరాసులు
ప్రజలు నృపుని జూచి బ్రతుకు చుంద్రు. 2

వేదశాస్త్రములకు విప్రాళికెల్లను
దండనీతి యందె యుండు రక్ష. 3

భుజము దట్టి ప్రజల బుజ్జగించెడు రాజు
పదములందె భక్తి ప్రజల కుండు. 4

నీతి దప్పనట్టి నృపుఁడున్న రాజ్యాన
కాలవర్షముండు కరువు దీరు. 5

ఖడ్గబలము కన్నఁ గ్రమము కనికరమ్మె
భువన విజయమిచ్చు నవని పతికి 6

ప్రజలకెల్ల రాజు భద్రమైనట్లుగా
దండనీతిగాపు ధరణి పతికి. 7

పక్షుల మాలకించు సరళత లేకున్న
నీతి దొరగి రాజు గోతిఁబడును. 8

బాధ దీర్పుటకయి బాధించునది గాన
రాచకర్మ దుష్ట రక్షణమ్ము. 9

మానవేంద్రుఁ డిచ్చు మరణశిక్ష ఫలము
పైరున కలుపెత్తు వంటిదగును. 10

# దుష్పాలన



కష్టపెట్టునట్టి దుష్టరాజున కన్న
హంతకుండె మెచ్చనైన వాఁడు. 1

దోచుకొన్న విధము దొంగలు కత్తెత్తి
యప్పుడపుడు పన్నులడుగు రాజు. 2

అనుదినమ్ముఁ దప్పు లరయనిచోఁ రాజు
చెడును రాజ్యలక్ష్మి ఘడియ ఘడియ. 3

సంపదలను ప్రజల సర్వమ్ము గోల్పోవు
ధరణి విభుడు దప్పఁ దండనీతి. 4

కష్టపడుచు ప్రజలు కార్చెడి కన్నీరె
కరగడీయు నృపుని కలిమి బలిమి. 5

నీతియె క్షితిపతి నెలకొను మార్గమౌ
నది దొలంగ సర్వ మంతరించు. 6

నావలేని యట్టి వసుమతి విధమౌను
పాలకుండు దయకు బాహ్యుడైన 7

పేదకన్న బాధ పెన్నిధిగా మన్న
రాజు నీతి దప్పి రాజ్యమేల 8

నీతి దప్పినట్టి నృపుడున్న రాజ్యాన
చెదిరిపోవు మబ్బు చినుక బడక. 9

పాడి తరిగిపోవు వచియింప రార్యులు
ధర్మ దూరుడైన ధరణి విభుఁడు. 10

# భయోత్పన్నత



తప్పు వరసి మరల దప్పుజేయని రీతి
శిక్షనిచ్చు రాజశేఖరుండు. 1

బలముగాను పూని మలువుగా శిక్షింత్రు
నీతిమార్గ మెరుగు నృపకులమ్ము. 2

దిన దినమ్ము ప్రజలు దిగులొంద బాలించు
ప్రభువు చెరగ జూడవలదు దినము. 3

దుష్టుడంచు ప్రజలు దూరంగ నా రాజు
పెక్కుదినము లుండి పెరగలేదు. 4

చూడ నలవిగాక చూచిన చిట్లుంచు
ధరణి విభుని పిరికి దయ్యమంద్రు 5

దబ్బరమ్ములాడు దాక్షిణ్యరహితుని
వద్ద నున్న కలిమి వృద్ధికాదు. 6

క్రమముగాని శిక్ష కటువైన మాటలు
అంపమగును గోయ రాజు బలము. 7

ఆదుకొవగ నుండు నాత్మీయులను రాజు
కోప పడినఁ గలిమి రూపు మాయు. 8

కుదుటబరచుకున్న మొదటనే సైన్యమ్ము
నెదిరి రాక నెలిగి యదిరి చచ్చు 9

దుష్టజనుల గూడి దుర్నీతిపరుడైన
ప్రభువె చాలు భూమి భారమునకు. 10

# ద య



కరుణ యనెడి దేవకన్యక, కనులలో
మెలఁగుచుండ జగతి వెలఁగుచుండు. 1

లోకమెల్లఁ దయకు లోనయి వర్తిల్ల
భారమవని దయకు దూరమైన. 2

రక్తి లేదుపాట రాగమ్ము లేకున్న
చూపులేదు దయను జూడకున్న. 3

ఎందుకున్న వేమొ యెరుగము ముఖమున
కరుణలేని వారి కండ్లు రెండు. 4

కనికరమ్మె యగును కనులకు రమ్యత
యది దొలంగ పుండ్లె యగును కండ్లు. 5

మట్టిలోన బుట్టు చెట్టుచేమ ననులు
కన్నులుండి చూడకున్న కరుణ. 6

కరుణ గల్గినట్టి కన్నులే కన్నులు
కండ్లు గావు మిగత కన్నులన్ని. 7

కరుణతోడ నిత్యకర్మల పాటించు
వారి హక్కె యీ ప్రపంచమెల్ల 8

కష్టపెట్టునట్టి కఠినాత్ములందును
దయను జూపుటగును ధర్మగుణము. 9

వేరుకొన్నఁ జాలు విషమైన భక్షింత్రు
దయను లక్ష్యముగను దలచువారు. 10

# గూ ఢ చా రి



విషయ మెరుగ వేగు విఖ్యాత గ్రంథము
ధరణిపతికి నేత్రద్వయ మటంద్రు — 1

ఎచ్చటెవట నెవ్వరేమేమి శేతురో
వేగుదెలియు టగును విభుని గలసి. — 2

గూఢ మెరుగకున్న గూఢచారిని గూడి
విజయముఁ గనదు రాజు విజయమునకు. — 3

శత్రు మిత్రు బంధు సర్వ సేవకులందు
గుట్టు గనుట నృపుని గుణమటంద్రు. — 4

కవిన జంకకుండ ననుమాన మీయక
తెలియవలయు వేగు తెలుప కేది — 5

సన్న్యసించినట్లు సకలమ్ము కనుగొంచు
చిక్కుకొన్న గుట్టు జెప్పరాదు. — 6

విన్న మర్మమడిగి వివరమ్ముగా వేగు
చెప్పవలయు దాని స్థిరముగాను — 7

తెలిపినట్టి దానిఁ దెలియని విధముగా
మారు వాని నడుగ మర్మమగును — 8

వేగు వేగు గనని విధముగా మువ్వుర
మాటఁ దెలియుటగును మర్మమనిన — 9

సత్కరింపరాదు సభయందు చారుని
మర్మమెల్ల దాన మరుగుఁబడును — 10

# ప ట్టు ద ల



ఉండుటనిన నొకని కుత్సాహ ముండుచే
వేరు దానికెట్టి పేరులేదు. 1

పట్టుదలకు మించి పరమార్థమే గాన
వర్థ మెంత యున్న వ్యర్థమగును. 2

పోయెనంచు దిగుల బొందరు గట్టిగా
పట్టుదలను చేత బట్టువారు. 3

పట్టుదలను విడువవట్టివా రున్నట్టి
చోటు దెలిసి లక్ష్మి చొచ్చుకొనును 4

నీరు నిండినంత నిడుపెక్కు దామర
యెంతకెంత శ్రద్ధ యంత వృద్ధి. 5

ఆశయంబు గొప్పదై యుండవలయును
కాని కాకపోని కష్టపడకు. 6

ఎదురులేదు పట్టు వదలక ధీకొన్న
వెనుక దిరుగ దేన్గు విశ్వములకు. 7

మంచి స్థితిని బొంది మహిమీద నున్నట్టి
పట్టులేనివారు బ్రతకలేరు. 8

గజము పెద్దదయ్యు గర్జించి పైబడు
పులికి వెఱచు దంత బలిమియున్న. 9

వారి వారి బలము వారికుండెడి పట్టె
పట్టులేనివారు చెట్టు నముల 10

# అలసత్వము



వెలుగు గలుగు గృహము మలిగిపోకున్నను
గోళ్ళు గిల్లుకొన్న గ్రుడ్డిదగును. 1

అలసత కలసతను కలిగింత్రు తమ యిల్లు
విల్లుగాగనంత నెంచువారు. 2

గోళ్ళు గిల్లుకొనుచు కూర్చున్న కాపుర
మంతరించు వానికన్న ముందు. 3

ఇల్లు గనిన పేరు గుల్లయైపోవును
ముందు తగుచు యత్నమందకున్న 4

మఱపు, జాగు, నిద్ర, మందతయును వాల్గి
చెరగ ముందు వాని తొరవు లగును. 5

ఖ్యాతి తరుగకున్న సిరిగా దలసత
పొందఁదగినదైనఁ బొందలేము. 6

పెఱుమారుదైన పనిపాట్లు లేకుండా
పోటుగాను విందమూట వచ్చు. 7

తవ్య గృహము వందు ప్రాల్మారి కీర్పర్ధ
శత్రువులకు సేవ సలుపవలయు. 8

మరుగుపడిన పేరు మెరుగౌను శ్రమమ్మె
మందముడిగి కార్యమగ్నుడైన. 9

అడుగులందు దార విడచిన రాజ్యమ్ము
మరల పొందవచ్చు మందముడుగ 10

# ప్రయత్నము



ఫలము గాదటంచు విసుగొందగా నేల
దాని కగును విలువ పూనికొలది — 1

పూనుకొన్న పనిని పూర్తిగా జేయక
విడుచు వాని జగము నిందజేయు — 2

ఉపకరింప గల్గు నుత్తమ గుణములు
సాహసాత్ము జూచి మోహపడును. — 3

పేడి చేతనుండు వాడి ఖడ్గమురీతి
కార్యశూన్యు డాద గల్గిచెల్లి — 4

సుఖము మఱచి కార్యముఖమున కన్నున్న
వానివలన బ్రతుకు వన్నెకెక్కు — 5

సాహసమ్ము దెచ్చు సంపదలన్నింట
నద్దిలేమి, లేమి కంతులేదు — 6

సోమరి యగువాని జొచ్చు మూదేవి
లక్ష్యపరుని గూడి లక్ష్మి దిరుగు. — 7

లేకయున్న నిఁద లేదంద్రు యత్నంబు
జేయనపుడె నింద జేరు నతని — 8

విధియె శత్రువైన విశ్రాంతి నెఱుగక
పాటుబడ్డ కూలి లోటులేదు. — 9

సాహసాత్ము తోడఁ సహకరించును లక్ష్మి
సోమరి యగువానిఁ లేమిపూను. — 10

# నిబ్బరము



దుఃఖములను పారదోలంగ మార్గంబు
నొవ్వకుండ జూచి నవ్వుకొనుటె　　1

పొంగివచ్చు దుఃఖముల నెల్ల ప్రాజ్ఞుండు
మనసులోనె త్రిప్పి మాన్పుకొనును.　　2

కష్టములను జూచి కష్టపడనివారు
కష్టపెట్టగలరు కష్టములనె.　　3

ఎట్టులున్న మార్గ మెద్దులాగును బండి
పట్టుబట్టి వెతలు పలచబడును.　　4

వెతలు పేరుకొన్న మతి చలింపదయిన
వెతలు వెతలు పడెదు గతికివచ్చు　　5

పోయెనంచు దిగులు పొందుటను తెలియ
రున్నవారు లోభ మురుగువారు　　6

కష్టములకె మేను కలదను పెద్దలు
తొట్రుపాటు బడరు దుఃఖములకు　　7

సహజమనుచు వెతలు సహించి సౌఖ్యమ్ము
కోరకున్న దుఃఖ భారముడుగు.　　8

సుఖము గల్గ పట్లఁ జొక్కిపోవని వారు
వెతలు గల్గపట్ల వెఱ్ఱిగారు.　　9

కష్టమనుభవింప నిష్టపడెడి వారి,
వైరులైన జూచి గౌరవింత్రు.　　10

# మంత్రి



సాధ్య సాధనములు సమయమ్ము స్వప్రజ్ఞ
యుచితమగును గాద సచివునందు 1

అభయ, మాలకింపు, ప్రభవమ్ము, జ్ఞానమ్ము,
తంత్రయైదు వలయు మంత్రి కెపుడు. 2

సచివుఁ డెరుగవలయు సామ దానమ్ములు
చెదరగొట్టి మఱలఁ జేరదీయ. 3

స్థిరముగాను దెలిపి స్థిరముగాఁ జెప్పెడి
కార్యవాది మంత్రిగాఁగఁ దగును 4

ధర్మమెరిగి మాట దాటిగ జెప్పెడి
కర్మఠుండె మంత్రిగాగ దగును. 5

ప్రజ్ఞతోడఁ శాస్త్ర పరిచయంబున్నచో
నంతకన్న విజ్ఞతరయ గలమె. 6

ఎంత దెలిసియున్న నిల సాంప్రదాయమ్ము
మరువ దగదు కార్య మార్గమందు. 7

తనకు దెలివిలేదు, వినమన్న వినదట్టి
వాని దిద్దగలుగు వాడె మంత్రి. 8

మర్మమైనయట్టి దుర్మంత్రి తన్నను
పదియు కోట్లు మేలు పగతుడైన 9

కాగల పనులైన కాకనే చెడిపోవు
చేతగాని మంత్రి చెంతమున్న. 10

# వాచాలత



మాటకారితనము మానిత సంపద
విలువలందు దాని విలువ వేరు. 1

మాట తోరవన్ను మంచి వెరుగులన్ని
నిలుపుకొనుము మంచి పలుకు లెఱిగి. 2

మిత్రవరుల వోలె శత్రువులైనను
"ఓర" యనుచె మాట పొరవంగ 3

మాట తీరెరింగి మాటాడు మాటాడ
దానిలోనె ధనము ధర్మముండు. 4

పలుకబూన మారు బలుకని రీతిగా
తెలిసి పలుకనదియె పలుకనంగ 5

మధుర భాషణముల నెదిరి చెప్పిన దాన
మంచి నెఱుఁగు నతఁడె మాటకారి. 6

వాగ్విలాన మెఱిఁగి వదరక నిర్భీతి
పలుకు నతని గెలువ వశముగాదు. 7

పలికి నట్లు జగతి పనిచేయు వాక్శుద్ధి
కలిగి పలుకు నతఁడు పలికెనేని. 8

అతిగ జెప్పు వారు మితభాషణమ్ముల
యుక్తి యుక్త మెరుగకున్న వారె 9

పరిమళమ్ము లేక విరిసిన పూగుత్తి
చదివి వ్యక్తపరువ జాలకున్న. 10

# సత్క్రియ

తోడు మంచిదైన తోడౌను సంపద
శిష్టవృత్తి సకల సిరుల నిచ్చు. 1

ఆచరింప గవల దపకీర్తి దెచ్చెడి
కార్యములను సర్వకాలమందు 2

రాను రాను పైకి రాగోరు వారలు
బొగడఁబడని పనులఁ దెగడవలయు 3

గాసితోడ నెన్ని కష్టాల పాలైన
చిత్తబలులు హీనవృత్తి దిగరు 4

చేయరాదు వెనక చింతింపు పనులను
చేసియున్న మఱల చేయవలదు 5

కన్నతల్లి యాకాలన్నను, దానికై
తప్పుదారి ద్రొక్క దగవు గాదు 6

దుష్కృతంబు వలన దొర యౌటకన్నను
పేదపడిన శిష్టవృత్తి మేలు 7

చేయఁదగని పనుల జేయంగ లాభమ్ము
కలుగుపైన కీడు గలుగు మఱల 8

దుఃఖపెట్టి యొరుల దోచిన ద్రవ్యమ్ము
దుఃఖ పడగ జేసి తొలగిపోవు. 9

మోసగించు వృత్తి దాచిన సంపద
యోటికుండలోని నీటి విధము. 10

# కా ర్య సి ద్ధి



సర్వకార్యసిద్ధి సంకల్ప సిద్ధియే
అన్ని దాని యందె యైక్యమగును 1

చిక్కులందు బెదమి, శ్రేష్ఠమ్ము వదినచో
చొక్కి పోమి కార్యసూరు మతము 2

పూనుకొన్న పనిని పూర్తిగావింపక
విఱపుకొన్నవాడు నిందపాలు 3

చెప్పవచ్చు నెన్నొ చెప్పిన రీతిగా
ననుసరించు వార లరుదు జూడ 4

కీర్తి దెచ్చుపనుల కృతకృత్యు డైనచో
చక్రవర్తియైన సత్కరించు 5

కోరు వారి శ్రద్ధ కొఱతఁ గాకున్నచో
కోరుకొన్న దెల్లఁ గూడివచ్చు. 6

ఆకృతిగని యెంచ కల్పుగా నొకపని
తేరుమ కడచీరె తిరుగబెట్టు 7

శంక లేక నొకటి సంకల్ప శుద్ధితో
విసుగు లేకఁ జేయ దొసఁగు రాదు 8

విఘ్నములకు వెఱచి విడువక సత్కర్మ
పూర్తిజేయ వలయు పూనినట్లు 9

ఎన్ని యున్న లోక మెన్నదు, దృఢచిత్త
మొందు లేని యెడల బెండుగాన. 10

# కార్య దీక్ష



నిర్ణయమున కెల్ల నిర్వాహ దీక్షయే
యాలసింప దాని కవగుణమ్ము — 1

ఆలసింప దగిన దాలసించుట లెస్స
వేగపడగ నున్న జాగుచెడుపు — 2

కార్యమెట్టిదైన కడతేర్పవలయును
సాధ్య మెట్లొ యట్లు జంకువిడచి — 3

శత్రుశేషమున్న శ్రమశేషముండిన
నగ్ని కణము వార్పనట్టి విధము — 4

కలిమి బలిమిస్థలము కాలమ్ము సత్వమ్ము
నెఱిగి జేయ పనులు మెరుగు పడును — 5

అగునొ కాదొ తెలిసి యగునైన సద్దాని
ఫలితమెఱిగి జేయవలయునదివి — 6

అనుభవజ్ఞుడైన నడిగి జేసిన కార్య
మెప్పటికిని చెడక మెప్పు వడయు — 7

కార్యమునకు తోడు కార్యమ్ముగై కొమ్ము
యేన్గు నేన్గు తోడ నీడ్చినట్లు — 8

ఆప్తు కన్న మేలు నత్యంత త్వరగాను
కాని వారితోడ కలియుటగును — 9

తగ్గుదలను జూచి తడయక వెంటనే
తీరి దీర్ప నది నీతి యగును. — 10

# దూత



ప్రేమ సత్కులమ్ము నృధిపీతు సంప్రీతి
కలుగు నతఁడు దూత గాగ దగును　　1

ప్రేమ, ప్రజ్ఞ, విషయ విశ్లేషణా శక్తి
దూతకు నివి మూడు తొడవు లగును　　2

విదురులందు గొప్ప విదురుండు ద్యూతమ్ము
క్ష్మతలేంద్రు లెదుట నలుపు నతఁడు　　3

తగిన రూపు, తెలివి తరుదని విద్యయు
మూడు దౌత్యమునకు ముఖ్యమగును.　　4

ప్రియపడంగ జెప్పి వెగటును తప్పించి
నయము గూర్చు నతఁడె స్వయము దూత　　5

నీతి నిర్ణయమ్ము నిలకడ నిర్భీతి
దోహదమ్ములగును దౌత్యమునకు　　6

కార్యమెఱిగి కాలతత్వమ్ము గుర్తించి
స్థానమెఱిగి పలుకు జ్ఞాని దూత　　7

సత్ప్రవర్తనమ్ము సఖ్యమ్ము తుల్యత
దూత లక్షణముగఁ జాతురెల్ల　　8

తప్పు పలుక డెవఁడొ తడబాటుగానైన
వాఁడె తగిన రాయబారి యగును.　　9

చావు మూడునైన క్ష్మతలేంద్రుల మేలు
గోరు నతఁడె రాయబారి యగును.　　10

# రాజాశ్రయము



తగిలి తగలకుండ సెగ గాచుకొన్నట్లు
బ్రతుకవలయు నృపుని పాలనున్న 1

కోరరాదు రాజు కోరెడి కోర్కెల
నట్టి యాశ్రితునకు నమరు సిరులు 2

మెలగవలయు నెంతొ మెలకువగా నంది
శంకరాగ మాన్ప శక్యపడదు. 3

చెవిని చెప్పరాదు చేరి నవ్వగరాదు
విడిచి చెప్పునేని వినుట మేలు 4

మర్మ మడుగరాదు మర్మంబు వినరాదు
వినుమటన్న దానిఁ వినుట లెస్స. 5

ఊహ నరసి కాలమూహించి విన్నది
వినయముగను బల్కు వెగటు విడక 6

వినగ దగ్గ వాని వినిపించి వినరాని
నడిగెనేని చెప్ప దొరఁగ రాదు 7

బాలుఁడనియు తనకు బంధువనియు నెంచ
వలదు రాజ్యపదవి గలిగినపుడు 8

ఎన్నబడిరి మనుజు వేరైన జేయరు
సుస్థిరమతులైన మనుజులెపుడు 9

ప్రాతవాళ్ళ మనుచు పీఠికి దూరమై
నడచుకొన్న పదవి నష్టమగును 10

# గుర్తింపు



అంగములనె జూచి యంతరంగ మెఱుగు
మనుజుఁ డవని లోన మానికంబు 1

మనసు నందు నుండు మర్మంబు ముఖమందె
చూచి చెప్ప నతఁడు సురల కీడు. 2

చూచినంతలోనె సూక్ష్మమ్ము కనిపెట్టు
వాని గొనుము ధనమునైన నిచ్చి 3

ఉన్న తలపు చెప్పకున్నను గుర్తించు
నతడు వేరె లోకు లందరందు 4

గురుతులన్ని జూచి గురి గానకున్నచో
కన్నులుండ నందు గన్నదేమి. 5

తనదు రూపుఁ జూపు దర్పణం బట్టుల
వదనమెత్తి జూపు హృదయ గతిని. 6

కష్ట సుఖములెల్ల గనవౌను ముఖమందె
దేని జూచి మిగుల దెలియవలయు 7

అర్థమగును ముఖము నం దంతరంగమ్ము
ముద్రలెఱుఁగు వాని ముందు నిలువ 8

పగయు, మైత్రి కండ్లు ప్రకటించుగావున
శక్తి వలయునండ్రు సంజ్ఞలెఱుగ 9

సూక్ష్మబుద్ధి యంచు చూపరు లెఱుగంగ
కండ్లుగాక వేరె కలదె చూడ. 10

## సభ

మాట పొందుఁదెలిసి కూటమ్ము గమనించి
వక్తస్ఫుటముగాను వ్యక్తపఱచు 1

మాట తేట తెలుగు మహనీయులందఱు
మన్న చోటెఱింగి యుచ్చరింత్రు 2

స్థితిని దెలియలేకఁ జెప్పెడివారెల్ల
మాట దెలియనట్టి మోటువారె 3

నిపుణులందు జూపు నిపుణత్వమున్నచో
మూగ వోలెనుందు మూర్ఖులెదుట 4

సుఖములందు గొప్ప సుఖమగు, పండితు
లున్న సభను మాట లుడిగియున్న 5

విజ్ఞులైనవారు వినుపించు సభలోన
వద్దువచ్చు వాని యెద్దదంద్రు 6

చదువుకొన్నవారి సామర్థ్యమంతయు
పండితాళి ముందె పరిమళించు 7

ఆలకించు వారి వరసి మాటాడుట
ఫలితమున్న చేను కాల్చినట్లు 8

సభను మెప్పు గోరు చతురుండు మఱచియు
పలుకరాదు మోటు వారిముందు 9

మలినమందు మధము జిలికిన విధమౌను
సాటిలేని వారి సభను బలుక. 10

# సభాకంపము



పలుకులందు భవ్యభావమ్ము గలవారు
సభకు జంకి మాట సడలరెపుడు 1

చదివి పట్టివారి సన్నిధి చదివిన
చదువు వ్యక్తపఱచు బుధుడె బుధుడు. 2

పగతు నెదిరి పోర, పలువురు సిద్ధంబు
నిర్భయముగా సభను నిలువలేరు 3

ఎఱిగినట్టి విషయ మెఱిఁగించి యెదిరిచే
యెఱుగ దగినదెల్ల నెఱుగవలయు. 4

చర్చ జరుగువేళ సభలోన జంకక
బుధుల కెదురు నిలువ చదువ వలయు 5

వాడి ఖడ్గమేల బోడిమి దప్పిన
చదువదేల సభకు ముదము నిడక 6

పేడి కత్తిబట్ట బెదురు వారెవ్వరుః
శాస్త్ర పరనమేల సభకు జంక 7

ఎంత చదువుకొన్న నేమౌను సభలోన
వ్యక్తపరుపకున్న ముక్తసరిగ 8

చదివి జంకునెడల శాస్త్ర పాటవముండి
విద్యరామికన్న వెలితి యగును. 9

చదివి జదుపనట్టి శాస్త్రజ్ఞులకు జంకి
తెలియఁజెప్ప లేకఁ దెల్లబోవ. 10

# కోట



ముఖ్యమగును కోట ముట్టడింపుటకును
ముట్టడింప దాగఁ ఘూల మదియె 1

శుభ్రమైన నీరు, సువిశాలపు స్థలము
కొండ యడువులుండ కోట యగును 2

పొడువు, వెడద, దృఢత బొల్పొంది రిపులచే
గూల్పరాని దగుచు గోట వెలయు 3

ద్వార మల్పముగను దండుండ పెద్దదై
దోచగాని దగుసు దుర్గమన్న 4

అరుల కలవిగాక నాహార సామగ్రి
కొరత లేవిచోటు గోట యంద్రు 5

సకలముండి ధైర్యసాహసంపు భటుల
గూడుకొన్న దగును కోటయన్న 6

ఏవిధముగాను నెదిరి కసాధ్యంబౌ
గట్టిపట్టు కోట ముట్టడింప 7

ఎదిరి బలము లదర బెదిరించు వీరులు
కుదురుకొన్న చోటు కోటయగును 8

ఉన్న తావునందె యన్ని సాములు నేర్వ
శత్రువులను గెల్వ స్థలమె కోట 9

పై గుణమ్ము లెన్ని దైకొన్న దగునేల
ఉండకున్న కోట దండగగును 10

# ధనార్జనము



లెక్కలేనివాని లెక్కింప నేపెడి
లెక్క ధనముగాక లేదు వేరె 1

లేనివాని నెవరు లెక్కింప రెవ్వరు
ఉన్నవాని గూడి సన్నుతింత్రు 2

ఎట్టి చోటనైన చిట్ట జీకటి బాపు
వారిపోని దీపమగు ధనమ్ము 3

ధర్మసమ్మతముగ ధనము సంపాదింప
కామ మోక్షమెల్ల గలుగుగాన 4

దాన ధర్మములకు తగని సంపాదన
వైభవమ్ము గాదు వగపు దెచ్చు 5

ప్రభువు లొక్కనంబు, పన్నుమ సుంకమ్ము
తప్ప మనగ మీరు మెప్పుగాను 6

దయకు బుట్టినిల్లు దాక్షిణ్య మనుపేర
కలిమి యనెడి దాది వలన పెఱుగు 7

కరులపోరు జూచు కరణిని గిరినుండి
చేతనుండ ధనము చేయు పనులు 8

ఎదిరి గర్వమణచ బదునైన ఖడ్గమ్ము
ధనముకన్న వేరె ధరణి లేదు 9

ధనమువలన గల్గు ధర్మంబు గామం
ఏది దొరకదాని విలువకొన్న. 10

# సేన



రథ గజాది యంగ రక్షణతో సేన
పెరిగినపుడె నృపుని పేరు పెరుగు 1

సేన కొంచెమైన చెదరక బెదరక
నాలమందు నిలచు మూల బలము 2

అలలవోలె యెలుక లరచి పైబడనేమి
యురగ ముస్సు రనిన పరుగు లిడును 3

చిలికి పోక వైరి సేనకు లొంగక
ముందు ముఖమె పట్టు మూలబలము 4

ఆలమందు నిలువ కాలపురుషుని యైన
యెదిరి నిలువగలుగు నదియె సేన 5

దండుకుండవలయు దక్షత నియమమ్ము
తెలివి తెంపు నాల్గు స్థిరముగాను 6

ఎత్తివచ్చువారి యెత్తును గనిపెట్టి
ముట్టడించునదియె ముఖ్యబలము 7

శక్తిహీనమైన స్థైర్యమ్ము లేకున్న
శిక్షణమున సేన శ్రేష్ఠమగును 8

వెలితి పేదరికము విసుగును లేకున్న
నిజముగాను సేన విజయమందు 9

బలము గల్గినట్టి భటు లెందఱున్నను
నడుపు నేతలేక చెడును సేన. 10

# శౌర్యము



విజయమందు మాదు నేతకు నెదురొడ్డి
నిలచినట్టివారి శిలల జూడు. 1

చెవులపిల్లి గురికి చిక్కు బాణము కన్న
వేఘ్గ తప్పుకొన్న యీటె మేలు

శౌర్యమందు గొప్ప శౌర్యము పగతుని
దుర్దినంబులందు తోడుపడుట. 3

చేత బరిసెలేని చింతన బోగొట్టె
రొమ్మునగల యీటె రోషమొసగి. 4

అదిరెనేని రెప్ప యెదురైన బాణమ్ము
లపజయంబున కదె యానవాలు. 5

గాయపడని నాళ్ళ గణియించి వీరుండు
వ్యర్థమాయె నంచు వ్యసనపడును. 6

వీర కంకణమ్ము విధునిచే బడయంగ
ప్రాణమీయ వీరవరుఁడు గోరు. 7

రాజు వలదటన్న రణరంగమున నుండి
వీరవరుఁడు రాడు వెన్ను చూపి. 8

లక్ష్యమునకు మనురు లక్ష్యంబు జేయని
వీరుఁ దోషములను వెదక రెవరు. 9

చావుఁ గోరుకొనను సామ్రాట్టు కన్నుల
నీరు గారునట్లు వీరవరుఁడు. 10

# స్నేహము

చేయనేమి కలదు స్నేహమ్ము కన్నను
కర్మకన్న రక్ష కల దదేది? 1

శుద్ధమైన మైత్రి శుక్లపక్షము బోలు
కృష్ణపక్ష మగును క్లిష్ట మైత్రి. 2

చదువఁ జదువ నయము పాఠ్యంపు కావ్యము
చేరఁ జేరఁ సుఖము శిష్టజనుల 3

నవ్వులాట గాదు నెవ్వరితో చెల్మి
హద్దు మీరఁ గొట్టిదిద్ద నగును. 4

పూనుకొన్న గాదు పొందిక నొందారు
ఐక్యభావ మందు నమరియుండు. 5

మైత్రికున్న సొంపు మందహాసము గాదు
విరియవలయు హృదయ వీధియందు 6

చెడుపు రాకఁగాచి చెడినప్పు డతనిని
విడకుండు టగును తోడటన్న 7

అడ్డపడును చేయి గుడ్డ జారినవేళ
నట్టు లొదవు మైత్రి యాపదలను. 8

సర్వకాలమందు సాధ్యమైనట్లుగా
నాదుకొనుటె మైత్రి కందమగును. 9

ఇట్టి లేఁడు నాకు నీ రీతి నే నన్న
మైత్రి గొప్ప కపుడె మచ్చ బుట్టు. 10

# స్నేహమును గుర్తించుట



చెడుపులేదు చెలిమిఁ జేయకపోయిన
కుజనమైత్రి వదలఁకొనుట మంచి　　　　1

అరసి యరసి స్నేహమాడని దోషమ్ము
చచ్చునట్టి బాధఁ దెచ్చిపెట్టు.　　　　2

గుణము, కులము, బంధుగణమును గుర్తించి
చేసినట్టి మైత్రి స్థిరము గాంచు.　　　　3

మంచి యింట బుట్టి మానంబునకు జంకు
వాని గొనుముదోసమైన నిచ్చి.　　　　4

దుఃఖ పడఁగ జెప్పి దోషమ్ము ఖండించి
మార్గ దర్శకమగు మైత్రి గొనుము　　　　5

కష్టములను మేలె కలదంద్రు, మిత్రత్వ
మెట్టి దనుచు కొలతఁబట్ట నగును.　　　　6

లభ్యమైన దన్న లాభమ్ము నొకనికి
దుర్జన సహవాస వర్జితంబె　　　　7

వట్టు వదలఁ జేయుఁ బని జేయఁబూనకు
చిక్కులందు జారు చెలిమి వలదు　　　　8

ఆదుకొనని స్నేహ మాపద లందున
చచ్చునపుడు దలుపఁ జిచ్చుబెట్టు.　　　　9

గుణము గల్గు చెలిమిఁగొను మెంతకైనను
ఇచ్చియైన విడుము తుచ్ఛ మైత్రి.　　　　10

# చనువు



చనువనంగఁ జెల్లు సహియించి యేదైన
స్వీకరింతునట్టి స్నేహితంబు. 1

స్నేహమునకు గుర్తు చెప్పకచేయుచే
నొప్పుకొనుటె దాని గొప్పదనము 2

చెలిమి చాల నాళ్ళు చేసిన ఫలమేమి
చనువె లేకయున్న సలుప నొకటి 3

బాధ్యత గలదంచు పాటించి చెప్పక
చేయు పనిని చనువె స్వీకరించు 4

తెలియని తనమనుచుఁ జెలిమితో పలికిన
హితుని తప్పు నోర్వ హితమటంద్రు 5

చనువు వలన గొప్ప సంకటమేరాగ
వదలుకొనడు మిత్ర వరుఁడు దాని 6

మైత్రియందు ప్రేమ సూత్రమ్ము తెగరాదు
హితుని వలన బ్రతుకె హీనమైన 7

వినక నెవరు జెప్ప విశ్వసించెడు మిత్రు
ద్రోహపరచు దినమె దుర్దినమ్ము. 8

కాల కాలముగను గలసిన స్నేహమ్ము
విడని వాని బొగడు విశ్వమెల్ల 9

ఎన్నిజేయ స్నేహ మెడబాటు గావట్టి
మిత్రులఁ బగవారు మెచ్చుకొంద్రు. 10

# దుర్జన మైత్రి



కరిగి ద్రాగినట్లు కనిపించు ఖలుమైత్రి
తరిగినంత మేలు పెరుగనీక — 1

కలిగినప్పు డుండి తొలిగిన దొలిగెడు
స్నేహ మున్ననేమి చెడిన నేమి. — 2

పాపి, దొంగవాని సరిబోలు వందురు
ఫలముగోరి చెలిమి సలుపువారు. — 3

అవివి చారవట్టి యశ్వంబు సరిమైత్రి
యుండు టొకటె లేకయుండు టొకటె — 4

కష్టములను నాదఁ గానట్టి స్నేహమ్ము
చెడినమేలె వృద్ధిఁ జెందకుండ. — 5

అల్ప జనులతోడి యన్యోన్యమునకన్న
ప్రాజ్ఞులైనవారి పగయె మేలు — 6

మాట మైత్రికన్న కోటికి లాభమ్ము
శత్రువులఁగనుండి సలుపు చెడుపు. — 7

విజయ మొసగు పనికి విఘ్నాలు గల్పించు
చెలిమి వదలనగును జెప్పకుండ — 8

మాట చేతలందు మర్మంబు గలమైత్రి
కలను గూడ వచ్చి కలతబెట్టు — 9

ముందు పొగడి వెనుక నిందించు దుర్జను
చెలిమి రెప్పపాటుఁ జేయవలదు. — 10

# తగని మైత్రి



పైకి చెలిమిఁజూపి పగ నెదవర్తించు
చెలిమి, చెలిమిగాదు కొలిమిగాని 1

ఘనవారలట్టు లనిపించి వేరైన
వారి చెలిమి వారవనితఁబోలు 2

చదివినంత రాదు సంస్కార సంపత్తి
మనసు మనసుతోడ మైత్రిగాక 3

నవ్వు తొలకరించు నయవంచకుల మైత్రి
తలఁచుకొన్న భయము గలుగు ఎందు. 4

చిత్త మత్తుకొనని చెలికాని మాటలు
నిర్ణయింపరాదు నిజమటంచు. 5

మిత్రులవలె మేలుఁ మిగులంగ బలికినన్
వంచకంబు బయట పడును దెల్లొ 6

వినరు కాని వాని వినయంపు మాటలు
విల్లు వంగినట్టి విధముగాన. 7

దండమన్న చేతి దాపున క్రూరాస్త్ర
మణఁచగలడు శత్రువైనవాడు 8

కాని వాని మొదల కలపినట్లుండియే
తొలిగిపోఁ మెఱుగు తొందఱగను. 9

మోసగానితోడ మురిపించునట్టులే
తెంపుకొమట చెలిమి కింపటంద్రు. 10

# అ వి వే క ము



తెలివి హీనమంచు దెలిపెడిదేమన్న
చెడుపువంటి మంచి విడతుటగును. 1

హీనమందు గొప్ప హీనమ్ము సర్వదా
చెడు ప్రవర్తనమ్ము విడువకుంట 2

సిగ్గులేమి, లక్ష్య సిద్ధిలేమి, మూర్ఖమ్ము
మూడు కూడియుండు మూర్ఖునందు. 3

చదివి చెప్పగల్గి, వది చేయకున్నచో
వాని కన్న బుద్ధి హీనుదెవడు? 4

ఏడు జన్మములకు నెద్దందు నరకమ్ము
నొక్క జన్మలోనె చిక్కబట్టు 5

సిరి బాహ్యుఁడగుచు నిర్వహించిన కర్మ
చెడును లేవియెడల శిక్ష మిగులు. 6

ఇతరు లనుభవింప వెతలఁద్రు స్వజనులు
తెలివిహీనుడున్న కలిమి మిగిలి. 7

వెఱ్ఱి కల్లు ద్రాగు విధమగు నవివేకి
హస్తమందు లక్ష్మి యమరునేని. 8

బుద్ధిహీను మైత్రి తద్దయా సుఖమిచ్చు
తొలఁగునపుడు బాధ కలుగరామి. 9

మట్టికాళ్ళఁ బరువు మంచ మెక్కిన రీతి
బుద్ధిహీనుడేగ బుధుల సభకు. 10

# అవగుణము



లెక్కకెక్కదేది లేకున్నఁ జెప్పగా
లెక్కకెక్కు బుద్ధి లేకయున్న. 1

హీను డీయ దేది యిచ్చినన్ వద్దని
పుచ్చుకొన్నవాని పూర్వకృతము. 2

కుమతి తనకు దానె కుమిలిపోయెడు బాధ
శత్రువులకు బెట్ట సాధ్యపడదు. 3

మౌర్ఖ్యమన్న దొకటి మహిమీద నున్నచో
వన్ని దనకె దెలియునన్న మదమె. 4

చదివినట్లు జెప్ప చదువకఁ జదివిన
చదువులందు బుట్టు శంకలెన్నొ. 5

తప్పుఁగప్పు కొనకఁ దనువునే గప్పును
గుణము లేనివాఁడు గొప్పగాను. 6

మర్మమెదలఁ జేయు మతిహీనుడగువాఁడు
తనకుఁదానె కీడు దనుకవించు 7

వినమి చెప్పినట్లు తనకైన దెలియమి
చచ్చుదనుక వెంట వచ్చునొప్పి. 8

బుద్ధిహీను డెవడు బుధులమాట వినడు
తనదు మార్గమందె తాను పోవు. 9

లోకులన్న దన్న లోకోక్తి కాదన్న
వాని దయ్యమనుచు వసుధ బిలచు 10

# కలహము



కలపి మెలపి యుండు చెలిమిని బాధించు
రుగ్మత కలహంపు రూపమగును. 1

చెలిమి లేకయున్న చెడుపుగాదొకనికి
కలహమాడరాదు కలుసుకొన్న 2

బాధలందు మిగుల బాధించు కలహమ్ము
విడచి నంత దాని వెలయు కీర్తి 3

కష్టములకు నెల్ల కలహమ్మె మూలమ్ము
దాని విడువ సుఖము తానె వచ్చు. 4

కలహములకు దిగకఁ దొలగి పోయెడువాని
గెలువ దలచువారు గలరె జూడ 5

కలహ జీవనమ్ము గలవాఁడు బ్రతుకున
బాగుపడుటకన్న నోగుపడును. 6

కలహమందె కన్ను గలవార లెప్పుడు
నీతి మార్గమందు నిజము గనరు. 7

వగకు దూరమైన ప్రాప్తించు సంపద
లంట దాని చెడుగు లావహించు. 8

కలహ దూరమైన కలదు భద్రత దాని
పెంచుకొన్న చెడుపు ముంచుకొనును. 9

కలహ వర్తనమున కలుగును కష్టాలు
నీతి పథమునందు నిధులు దక్కు 0

# శత్రుశక్తి



అధికులందు కలహమాడుట దోషమ్ము
అడకున్న దోష మల్పులందు 1

సానుభూతి, మైత్రి స్వబలమ్ము లేనట్టి
వాని శత్రువెల్ల వదలిపెట్టు 2

దానహీను, బుద్ధిహీను నిర్దాక్షిణ్యు
గెలువ సులభ మెట్టి బలములేక. 3

విడువఁ డాగ్రహమ్ము విడచు నిదానమ్ము
నట్టివాఁడు లోకు నందఱికిని 4

నీతియు నియమమ్ము నిత్య కర్మములేని
నిందపరుని గెల్వ నందమంది 5

కన్నుఁ గాననట్టి కామమ్ము కోపమ్ము
నున్నవాని గెల్పు టుత్సవంబు. 6

ఇచ్చియైన కలహమేర్పడ జూడుము
దగ్గరుండి గుంట త్రవ్వువాని. 7

దుర్గుణంబుతోడ దుశ్చేష్ట లలవడ్డ
రోతురెల్ల శత్రు ప్రీతివాఁడు. 8

సమరమునకు తృప్తి సాధ్యత సద్బుద్ధి
లేనివాడు శత్రువైన యెడల. 9

శాస్త్ర హీనతోడ శతృత్వమందని
వాని నెట్టి కీర్తి వలచిరాదు. 10

# విరోధవిరోధము



వైరమనెడు దుష్టవర్తన పరిహాస
మునకునైన పెట్టుకొనఁగ రాదు. 1

కలహ మాడవచ్చు విటకానితో నైన
పలుకులాడువాని పగను వలదు. 2

తనకు బలము లేకఁ దనవారు లేకుండ
కలహమునకు దిగినఁ గలదె బుద్ధి. 3

పగతునైన నెయ్యముగ జేసుకొనువాని
మంచిలోనె జగతి మహిమ వెలుఁగు 4

తోడులేదు జూడఁ, దోడైన బగవాళ్ళు
వాళ్ళనొకని స్నేహ వర్తిఁజిమ్ము 5

కలసి యుండు వెనక కలహమాడుట కన్న
కలసి కలియనట్లు మెలఁగుటొప్పు 6

అరయలేని వాని కగచాట్లు చెప్పకు
బలముఁ జెప్పుకొను బగతునెదను. 7

తలచుకొన్న పనికి ఏలపిన సామగ్రి
జేర్చుకొన్నవానిఁ జెరుపతరమె. 8

ముండ్లచెట్లు నెల్ల మొలకలో గిల్లక
ముదిరినంత గదన నొదవుబాధ 9

శత్రువులను వంచ శక్తిజాలని వాఁడు
స్వేచ్ఛగాను శ్వాస పీల్చలేడు. 10

# లోపగ



పీఠ, పీళ్ళ గుణము వాఠంగ దెలియును
ముందు దెలియదల్లె బంధు పగయు — 1

కత్తినెత్తు పగకు నొత్తిలఁ బనిలేదు
భయపడంగ వలయు బంధు పగకు — 2

బనవారి వైరమగుపించకనె చంపు
కుమ్మరి చెయినుండు కూసు విధము. — 3

అంతరంగ కలహ మారంభమైనచో
పుట్టరికమె విన్నుఁ బట్టియిచ్చు — 4

చూడ చుట్టమయ్యు కీడెంచువాఁడున్న
వాని వలన వచ్చు ప్రాణహాని. — 5

ఐక్యపడిన వారికైనచో కలహమ్ము
తప్పుకొనఁగ లేము ముప్పురాక. — 6

కలిసినట్లె యుండు కలతమ్ము పైమూత
ఇంటి పగయునట్లె యిమిడియుండు — 7

ఆకురాయి యినుము నరగదీసెటి మాడ్కి
పాడుబడును గృహము బంధుపగకు. — 8

అంతరంగ కలహ మణు మాత్రమున్నను
దాని ముప్పు గొప్పగాను తోచు. — 9

సర్పమున్న యింటఁ సంసారమున్నట్లు
సమరసమ్ము లేక సాగు బ్రతుకు. — 10

# పెద్దల నవమదించమి



నిందఁ జేయకున్న నియతాత్ములను జూచి
క్షేమ మంతకన్నఁ జెప్పలేము. 1

ఆర్యులైన వారి కవమాన మొనరింప
వారి వలన తెగని బాధలబ్బు. 2

చెడగమన్న, నేది నడుగకు పెద్దలఁ
జావుఁగోర కీడు సలుపఁ జాలు. 3

ఆర్యులైన వారి కవమాన మొనరింప
తట్టి లేపినట్టు దండధరుని. 4

తప్పి బ్రతుకలేదు ధరణిలో నెచ్చోట
శిష్ట జనుల మనసు కష్టపడిన 5

బ్రతుకవచ్చు నగ్ని బడినైన, పెద్దల
నవమదించి బ్రతుక నలవికాదు. 6

ఇంద్ర భోగమైన నేహౌమ శిష్టుల
మనసు కష్టపడిన మరుక్షణమ్ము 7

అచలులైన వారి నవమదించిన వారి
యాస్తి నాస్తి వంశ మంతరించు 8

బ్రహ్మ చింతనుండు ప్రాజ్ఞుఁడు కోపింప
రాజ భోగి యైనను రాజ్యమెడలి. 9

చివుకుమనినఁ జాలు సిద్ధుల హృదయము
లంగరక్ష లెవ్వి యాదుకొనవు 10

# స్త్రీలోలుఁడు

స్త్రీల ననుసరింపఁ జెడుపౌను, కార్యజ్ఞ
లిష్టపడని కార్య మిది యటంద్రు 1

మగువలందు దగిలి మఱచిన సర్వమ్ము
వమ్ముదాని తన్నఁ వగపు హెచ్చు 2

మగువ కఱఁగి యుండు మగవానికే ప్రొద్దు
సుజనులందు చోట కోరరాదు. 3

మగువ కఱఁగ మోక్ష మార్గమ్ము శూన్యమ్ము
పూనుకొన్న పనులు పూర్తిగావు 4

సతికి వెఱచు నతఁడు సతతమ్ము వెరచును
పాయపడుటకైన సజ్జనులకు. 5

అమర పదవులందు నమరినవాఁడైన
నాతి కఱఁగి యున్నఁ ఖ్యాతిరాదు 6

పొలతి మాటఁ వినెడి పురుషున కన్నను
మానదృష్టి నున్న మగువ మేలు. 7

మిత్రహితము లేదు మిగులదు ధర్మము
లతివ మాట దాట నతని కెందు. 8

పొలతి కఱగుఁ నతఁడు పురుషార్థముల మాని
పుణ్యకార్యములను బోవడంచు. 9

దీర్ఘదృష్టియందు స్థిరపడ్డ వారలు
స్త్రీల మోహమందు జిక్కుకొనరు. 10

# వెలయాలు



వేశ్య వినయమెల్ల వెలకోసమేగాన
ముచ్చటింపులెల్లఁ ముప్పుఁదెచ్చు 1

వెలకు దగ్గ ప్రేమ వెలయాలు చూపించు
మోసపోకు దాని మోహమునకు 2

వదుపుకాంత సుఖము, వడిరేయి దెలియక
శవముతోడ గలియు చందమగును. 3

పావిదాని పొందు పత్యార్థ మెఱిగిన
వారు గోరుకొనరు వాస్తవముగ. 4

గౌరవమ్ము గోరువారలు వెలయాలి
యందచందములకుఁ జిందిపోరు. 5

కొంత తెలివితేట లెంతేని గలవారు
వారవనిత సుఖముఁ గోరుకొనరు. 6

తలపునందులేక వలపించు వగలాడి
గూడువారు లేత గుండెవారు. 7

మూర్ఖుడైన వాని మోహవి దయ్యమ్ము
వంచగించునట్టి వారవనిత. 8

పిగ్గు లేనిదాని విగ్గైన కౌగిలి
పాప మంటగట్టు పాశమగును. 9

జూదము, వెలయాలు, చోరత్వ మిమ్మూడు
పిరి దొలంగు వాని స్నేహమగును. 10

# త్రాగుబోతు



కీర్తి మాయమగును, కేవల పశువగును
కల్లు త్రాగు గుణముఁ గలిగెనేని. 1

పెద్దవారి మంచి వద్దనుకొన్నచో
త్రాగి తందనాల నూఁగవచ్చు 2

త్రాగువాని, కన్నతల్లియే రోసిన
వార్యులైన వారి నడుగనేల? 3

మానహీనుడైన మదుపానరక్తుని
చేష్టఁజూడఁ సిగ్గె సిగ్గుపడును. 4

పైక మొసగి బదులు పైకమ్ము గొనునట్టి
మందబుద్ధికేమి మంచి గలుగు. 5

నిద్ర, చావువాని నియమమ్ము సమమౌను
విషము మదువు రెంటి విధము నట్లె 6

ఎఱుగనట్లు మరుగు మరుగున త్రాకిన
ఉమ్మివేతురతని నూరివారు. 7

త్రాగుబోతువాఁడు త్రాగలే ననలేడు
తప్పు దాచ వాని తరముగాదు. 8

దీపమెత్తి నీళ్ళ దేలిన చందమ్ము
త్రాగువాని మాన్పఁ దరముగాదు 9

బోదలేనివేళ బోదలో బడియున్న
వానిఁజూడ బుద్ధి వచ్చునేమొ? 10

## జూ ద రి



చేప గాలమందు జిక్కెడు విధమౌను
గెలుపు సిద్ధమైన వలదు జూదు. 1

ఒకటి వచ్చినట్టి యుత్సాహమున నూరు
వదలు వాని బ్రతుకు బదిలమగునె? 2

దొల్లి పోవువాని దొడ్డగా నమ్మిన
ద్రవ్యమెల్ల నెదిరి దారిబట్టు. 3

కీడుఁ మూడఁజేసి కీర్తిని పోగొట్టి
పేదవడఁగ జేయుఁ జూదమొండె. 4

హస్తకౌశలమ్ము నక్షపాటవమున్న
పేదరికమె వచ్చుఁ జూదమాడ. 5

తినక బెక్కు బాధ లనుభవింప దగెను
జూదమందు జిక్కి చొక్కు నతడు. 6

తరతరాల నుండి తనదాక వచ్చిన
యాస్తి జూదమాడ నంతరించు. 7

కల్ల లాడజేసి కవికరమ్ము బాపు
నొంది జూదమగుమ నరకమునకు 8

కూడు గుడ్డ సొత్తు కోవిదత్వము కీర్తి
మంట గలియు జూద మంటుకొనిన 9

అడుచుండు జూద మోడంగ నోడంగ
బాధలన్న వాళ బ్రతుకునందు. 10

# మ ం దు



హెచ్చు తగ్గులందు వచ్చు నస్వస్థత
వాత పిత్త శ్లేష్మ రీతిగాను. 1

తిన్న దరిగెనంచు దెలిసి భోంచేసిన
మానవునకు వేరె మందు వలదు. 2

జీర్ణమైన వెనుక జేసిన భోజన
మల్పమైన వృద్ధి యాయువునకు. 3

ఆకలి యగునప్పు డనువైన యాహార
మెఱిఁగి సరిగ దిన్న మరుగు జబ్బు 4

కానిదాని దినక నైనది మితముగా
నారగింప వ్యాధు లంటవండ్రు. 5

అతిగ దినని వాని కారోగ్యమున్నట్లు
అతిగ దినెడువాని కబ్బు జబ్బు. 6

రుచికి దిన్నయెడల రోగంబు లెక్కువై
పెక్కు బాధలతని లెక్కబెట్టు 7

జబ్బు, కారణమ్ము, శమనమ్ము గుర్తించి
మందు నొసఁగ వైద్య మార్గమగును. 8

వైద్యుఁడైనవాడు వ్యాధిని గుర్తించి
వయసు కాల మెఱిగి వ్యాధి దీర్చు. 9

వ్యాధియు, పరిచర్య, వైద్యుఁడు, రోగియు
వైద్యశాస్త్ర పాటవంబు నాల్గు 10

# వంశము



మంచి యింటఁ గాక మానమ్ము సమదృష్టి
ఇతర గృహములందు వెదక గాదు. 1

సత్యనిష్ఠ, లజ్జ, సద్వర్తనంబును
సంప్రదాయమునకు సహజ గుణము. 2

మాట సొగసు, ఠీవి, మందహాసము మూడు
గుణములుండు గొప్పకులమునందు. 3

గొప్ప యింటివారు తప్పు దారికి బోరు
కోట్లకొలది ధనము కూడుచైన. 4

ఇచ్చువట్టి గృహము నొచ్చిపోయినగాని
ప్రాత గుణము మిగిలి పరిమళించు. 5

మచ్చరాక బ్రతుక నిచ్చగించినవారు
ప్రతినకైనఁ బాడుపనులఁ దిగరు. 6

పెద్దయింటి తప్పు పెద్దగాఁ దెలియును
చంద్రబింబమందు చాయ విధము. 7

గుణము విడచి దోషగుణములఁ బాల్పడ్డ
వంశమందు బుట్టు సంశయమ్ము. 8

పుట్టునపుడె మొలక మట్టిసారము దెల్పు
వంశ మెట్టి దగునొ వాక్కు దెల్పు. 9

మంచి వలయునన్న మర్యాదవలయును
వినయ మవసరమ్ము వెలయఁ గులము. 10

# మానము



ఎంత గొప్పదైన నింటికిఁ దగకున్న
దానిఁ మానుకొనుటె మానమగును. 1

గౌరవమ్ము కీర్తి గావలె ననువారు
మరువరాదు యింటి పరువు నెరిగి. 2

పెరుగునప్పు డహము తరుగంగవలయును
తరుగునప్పు డహము పెరుగవలయు 3

పదవి భ్రష్టులైన పతితకేశములట్లు
విలువ చెడుట లోక విదితమగును. 4

ఏనుగంటివాడు యెలుకయైపోవును
చెయరాని పనులఁ జేసెనేని. 5

పూజ్యతయునురాదు పుణ్యంబు దక్కదు
తుంటరులగువారి వెంటఁదిరుగ 6

అడిగి బ్రతుకవేం ననమదించెడివారి
చెడినమేలె వారి నడుగకుండ 7

చెడియు గౌరవమ్ము జీవించుటన్నది
మందు దినుచు బ్రతుకు చందమగును. 8

ఉసురు విడచు చెమరి యొక్కరోమమూడయ
ప్రాణమిడుదు రట్లె మానధనులు. 9

మానరక్ష కొఱకు ప్రాణమ్ము బలిసేయు
వారి నెఱిఁగి జగతి ప్రస్తుతించు. 10

# పెద్దరికము



ఖ్యాతి వారివారి కార్యమందాసక్తి
వెలితి దానియందు విముఖుడైన — 1

జన్మ మందఱికిని సమమౌను కర్మలే
వారి వారి గౌరవమ్ము నిచ్చు — 2

పీఠమెక్కినంత పెద్దగా దల్పుందు
పెద్ద చిన్నగాడు గద్దె దిగిన. — 3

ఖ్యాతి తమ్ముతాను కాపాడుకొమటందె
ధర్మపత్ని విధము నిర్మలముగ — 4

శ్రేష్ఠులైనవారె చేతురు చేసిన
చేయదగిన పనులు శ్రేష్ఠముగను. — 5

అల్పుల మదికందదార్యుల శక్యమ్ము
పొందవలయు ననెడి బుద్ధులెల్ల — 6

అల్పులైనవారి కధికారమిచ్చిన
స్వల్ప పనులజేయ సాహసింత్రు. — 7

అణిగియుండు గొప్పతనమెల్లరందును
చిన్నతనము గర్వశిఖరమెక్కు — 8

పెద్దతనము గర్వపద్ధతి నెఱుగఁడో
తప్పు దెపుడు దాని దెల్పుచుండు. — 9

తప్పు మఱచు పెద్దతన మెప్పుడైనను
చిన్నతనము దాని జెప్పి దిరుగు. — 10

# ఆదర్శము



మార్గదర్శకులగు మహనీయులెల్లరు
నీతిఁ దప్పనట్టి నిష్ఠపరులు 1

గుణమె గొప్పవారి ధనమగు మిగిలిన
ధనము లన్ని ధనము లనరు వారు 2

ప్రియము నయము భయము దయయు సత్యమ్ము
గొప్పదనము నైదు గుణములగును. 3

తాపసాంశమనఁగఁదగు నహింసావృత్తి
నేరమెన్నకున్న నీతివృత్తి. 4

వినయవంతుడైన విక్రమవంతుండు
శత్రువులనుజేయు మిత్రువులుగ 5

శీలమునకు గుర్తు చిన్నలనెడనైన
తప్పు నెఱిగి దాని నొప్పుకొనుటె 6

ఉపకరింపకున్న నపకారమెంతుచో
శీలమున్నదనుచు జెప్పలేము 7

లేమి కాదు ధనము లేనంతమాత్రాన
గుణముఁ గల్గియుంటె గొప్పదనము. 8

గుణసముద్రు డుర్వి మునిఁగిపోవగ నున్న
నౌకయందు దొలఁగ డడుగుగూడ 9

ఆర్యులందు నున్న నాదర్శ మెఱిగిన
ధరణి మునిఁగి పోకఁ దప్పుకొనునె. 10

# శీలము



అందఱియెడఁ గలసి యన్యోన్యముగ నుంట
సుగుణమునకు నందు సులభ గుణము. 1

కవికరమ్ము వంశ గౌరవ మీరెండు
చాటి చెప్పు నొకవి సద్గుణంబు 2

కాదు దేహభావ మేదియు సమమన
సద్గుణాళి సమమె సమమనంగ 3

నీతి నియమములను ప్రీతితో పాటించి
మెలఁగువారి నెందు మెచ్చు జగము 4

సరసమైన కీడె సద్దులతోనాడ
విరసమైనమేలు విజ్ఞులందు 5

ఉత్తములగువార లుండుటచేతనే
మహిని మహియటంద్రు మట్టియనక 6

సూదివంటి బుద్ధి సూక్ష్మతయున్నను
గుణములేమి వృథ గణనమమ్ము 7

స్నేహముడిగి చెడుపుఁ జేసెడి ప్రజలందు
ప్రీతి జూపుచుండు నీతిపరుఁడు. 8

కలుషగోఁతనము గణమైన వానికి
చిట్టచీకటగును పట్టపగలె. 9

బుద్ధిహీను నొద్దఁ దద్దయు ధనముంట
మురికి పాత్ర పాలుఁ బోసినట్లు. 10

# లుబ్ధత

ధనము దొంతులందుఁ దగఁబేర్చి చచ్చును
నిర్దయుండు తినక వ్యర్థముగను. 1

ధనమె మూలమంచు దానధర్మములేక
హీనజన్మ మెత్తు నిర్దయుండు. 2

కూడబెట్టుకొనుచు గుణమని సత్కీర్తి
బడయలేని జనులు భారమవని 3

మిగతఁగాగ జెప్ప దగినది యున్నదే
యిచ్చి మెప్పు బడక జచ్చునతఁడు. 4

తాను దినక నొరులకైనను బెట్టక
కోటి యున్ననేమి గుణము దాన 5

ముగ్ధ పెండ్లిగాక ముదిమిపాలైనటు
లాడుకొనని ధనము బాధలందు. 6

ఇచ్చి యనుభవించ నిచ్చగింపని వాఁడు
సిరికిఁ బట్టుకొన్న చీడపురుగు 7

వచ్చునట్టి ధనము నగరి మధ్యము నందు
విషఫలమ్ము లిచ్చు వృక్షమట్లు 8

ప్రీతిఁదొలఁగి నేది బెట్టక నవనీతి
జేర్చుకొన్న ధనము జేరునొరుల 9

పేరునరిన వారు పేదనడగఁ [illegible]
కురిసి కురిసి మబ్బు తెరిపియగు[illegible] 10

# సిగ్గు



పాపకర్మలందు పాటించవే సిగ్గు
స్త్రీలకుండునట్టి సిగ్గు వేరు. 1

కూడు గుడ్డ ప్రాణికోటికి సమమగు
మర్త్యములకె లజ్జ యుచితమగును 2

ఉదర పోషణార్థముఁదును జీవులు
సిగ్గు శ్రేష్ఠమందె నిగ్గుదేలు 3

భూషణమ్ము సతికె బుధవరేణ్యుల కెల్ల
వింతజబ్బు దాని విడచి నడువ 4

ఎదిరి నింద తనది విధముగ సిగ్గిలు
వాడె సిగ్గు కెల్లఁ బాదియగును. 5

మాన రక్షజేయు మహనీయు లద్దాని
విడచి బ్రతుకలేరు వీసమైనా. 6

ప్రాణ మొసఁగి యైన మానమ్ము రక్షింత్రు
దానియందు దృష్టిఁ దగులువారు. 7

నరులు సిగ్గుపడెడి పని లాభమని జేయ
వానిఁ జూడఁ సిగ్గు వణకుచుండు 8

నీతిఁ దొలఁగ కులము నిందలపాలౌను
సిగ్గు దొలఁగ వన్నె క్షీణమగును. 9

సిగ్గు విడచి తిరుగు జీవులు జీవులా
త్రాడు దిరుగు బొమ్మలాటగాని. 10

# గృ హ ర క్ష



ఎత్తుకొన్న కార్య మేరీతిగా నైన
పూర్తిజేయ వలెఁదె పూజ్యరన్న — 1

గట్టి పట్టుదలయు కార్యజ్ఞతాబుద్ధి
రెండె చాలు గృహము వృద్ధిజెంద. — 2

అహరహమ్ము గృహము పరివృద్ధి గోరెడి
వాని నాద విధియె పట్టు విడిగా — 3

అన్ని వచ్చి పడును సమకూల మగునట్లు
శ్రద్ధయున్న గృహము వృద్ధిజేయ. — 4

తప్పు లేకఁ యింటి గొప్పకుఁ దాల్పర్ద
చుట్టమనుచు నతనిఁ జుట్టు జగము. — 5

ఇంటి వారి నెల్ల నేక ధాటిగ నేలు
వాని దగును మగత వాస్తవముగ — 6

సమరమందు దుముకు చందంబు గానందు
యింటి పెత్తనమ్ము నెత్తుకొనుట — 7

కార్య గౌరవమ్ము కష్టమ్ము కాలమ్ము
జూచునెడల గృహము శూన్యమగును. — 8

ఇంటి వారికెట్టి యిక్కట్లు బెట్టని
వాని బ్రతుకు దుఃఖ భాజనమ్మె! — 9

ఇంటిమీద పడెడి యిడుముల నడుమిచ్చు
వాదుడింట లేమి నాశనమ్ము. — 10

# వ్య వ సా య ము



మేడి వెనుక దిరుగు మేదిని సర్వమ్ము
పాటువడిన దాని పాటి యదియె. 1

దున్నువతని నమ్ముకొన్నది లోకమ్ము
తిండి కిరుసు వంటి వాడుగాన. 2

జీవితంబు దున్ని జీవించు వారిదే
కూలిబ్రతుకు మిగత కొలువులన్ని 3

ఇచ్చుగాని నౌకరి యిమ్మని యడుగడు
సేద్యమున్న జాలుఁ జేతి నిండ. 4

హాలికాళి హస్తమాడనిచో నిల్వ
ముక్తవరులకైన శక్తిలేదు. 5

పంట పీడఁ దనదు ప్రభుని ఛత్రపు ఛాయ
నన్య నృపులఁ జాతు హాలికుండు. 6

హలము మన్న పావుతులమట్లు జేసిన
నేలకెరువు బెట్ట నేల మరల 7

చాలు కన్న నెరువు జలముకన్నఁ గలుపు
కలుపు కన్న కంచె బలము కృషికి 8

కయ్యమీద దృష్టిఁ గాపు జూపకయున్న
భర్త ప్రేమలేని భార్యవిధము. 9

బీదవంతు బైరు బెట్టక కూర్చున్న
వానిఁ జూచి క్షేత్ర భామ నవ్వు. 10

# దారిద్ర్యము

పేదరికపుసాటి బాధ యేదన్నచో
పేదరికమెగాని వేరుగాదు. 1

లేమి యనెడు పాపి లేకుండగాఁజేయు
ఇహపరాల రెంట నేరికైన. 2

పేద యయ్యెనంచు పేర్వడ్డ మాత్రాన
ఇంటి గొప్పదనము మంట గలియు. 3

గొప్ప యింట బుట్టినప్పటికైనను
లేమిచేత వచ్చు లేసుమాట. 4

పేదరికము జాలి బాధల నన్నింట
వేకపఱచి సుఖము లేకఁ జేయ. 5

విషయ మెఱిఁగినట్టి విద్వాంసునైనను
పేదయైనఁ జూడ రాదరమున. 6

ధర్మమునకె తగని దారిద్ర్య మబ్బిన
నమ్మయైన జూచు నన్యునట్లు. 7

విన్న బడిన బాధ నేడెట్లు బడనంచు
తల్లడిల్లు పేద తలచి దలచి. 8

కన్ను మూయలేము కటిక దారిద్ర్యాన
నిప్పు మీదనైన నిద్రవచ్చు. 9

సాగలేనివాడు సన్న్యసింప కుంట
నప్పు ఋణము దీర్ప మందునట్లె. 10

# యా చిం చు ట



అడుగఁదగిన వారి నడుగుము లేదన్న
నింద నీకు కాదు పొందు వతని. 1

అడుగుటైన గాని యందంబుగా నుండు
నీసడింపు లేక నిచ్చువారి. 2

దాపరికము లేని ధర్మాత్ములను జేరి
యడిగి తినుట గూడ నందమగును 3

ఇచ్చినంత గొప్ప యిమ్మని యడుగుట
కలనునైన దాచఁ గానివాని 4

దాచ కిచ్చువారు ధరగల రందుకే
యడుగు వారు మరుగు బడుటలేదు 5

ఉన్నపేదబాధ లొక్కసారిగ దీరు
దాచకిచ్చు వారి దాపునున్న 6

పరిహసించి తిట్టి పంపక నిచ్చెడి
వారిఁ జూడ వర్ధి గోరుచుండు 7

అడుగువారు లేమిఁ దడిగల భూమిపై
ప్రతిమలు తిరుగాడు గతి దలంప 8

అడుగువార లపని వదృశ్యులైనచో
నిచ్చువారి కీర్తి వచ్చుటెట్లు 9

బిచ్చమెత్తఁ దగదు బింకమ్ము గలవాఁడు
వాఁడె దెలియు దాని వాడవాడ. 10

# అపరిగ్రహము



మనసు నచ్చియిచ్చు మనుజుల కదనైన
నడుగరామి కోటికైన మేలు 1

అడిగి దినఁగ జేయ వజ్రదైన గానిమ్ము
తిరిగి తిరిగి చెడుత దిరిపమెత్తి. 2

పేదరికము బాయఁ బిచ్చమే గతియన్న
నంతకన్న హీనుఁ డవని లేడు. 3

బ్రతుకు శూన్యమైన బ్రతిమాలి యడుగని
సద్గుణంబు వ్యాప్తి సర్వజగతి 4

గంజినీళ్ళె యైన కష్టించి చమటోడ్చి
యారగింప రుచికి నంతులేదు. 5

ఆవుకైన నీళ్ళ నడుగరాదొక్కని
వాక్కుగొప్ప కపుడె నాశనమ్ము. 6

యాచకాళి నెల్ల యాచించి వేడెద
నడుగవలదు లోభులైన వారి 7

యాచకమను నావ దాచుట యను బండ
తగిలి సాగలేక పగిలిపోవు 8

తలచినంత మనసు ద్రవియించు యాచింప
దాచుటంతకన్నఁ దారుణమ్ము 9

అడగ నెంచ గుండె తడఁబడు లేదన్న
నాగిపోత విలువ టబ్బురమ్మొ. 10

# అల్పులు



అందఱివలె నుందు రల్పులఁ జూడంగ
తెలుసుకొనఁగ లేము గురుతు దెల్పి 1

తెలివిపరులకన్న తెలివి హీనుడె మేలు
దిగులుపడడు గాన దేనికైన 2

అల్పు లమరు లగుదు రది యెట్టు లన్నచో
తలచినట్లు చేయగలరు గాన. 3

అల్పుఁ డతని కన్న నల్పుని గనుగొని
తానె గొప్పగాను దలఁచుకొనును. 4

అల్పుదైవవాని యాచారమే తయ
మాతచేత మిగత నల్ప కొంత 5

మర్మమొకటిఁ దెలియ మారుఁప్రోగింతురు
తగుదు రల్పు లెల్లఁ దప్పెదలకు 6

మెక్కినట్టి చేతి మెతుకైన నల్పుండు
పెట్ట డొకరి కిచ్చి కొట్టకున్న 7

అడుగ నేదియీయ డల్పుండు చెఱకును
పిండినట్లు గాఢఁ బిండకున్న 8

తినుటఁ గట్టుకొనుటఁ దిలకించినంతనే
యల్పు డోర్వలేక నంగలార్చు 9

అల్ప కష్టములకు నమ్ముడు వోవంగ
నర్హతెవరికుండు నల్పు విడచి. 10

# మో హ నా ం గి



అమర కాంతయౌనా! నెమలౌనా యీ భామ
మోహజలధి నిట్లు ముంచుటేమి! 1

దండుతోడఁ వచ్చి తాకినట్లున్నది
చూడఁజూడ నన్ను మందరాంగి 2

ఎఱుఁగ నెమరువంగ నెవ్వరో మున్ముందు
కంటి దేవి వెదర కండ్లనిపుడు 3

కవినయంత కనులు తివివేయు ప్రాణమ్ము
మోహమెందు బోయె ముగ్ధకనుల 4

చంచలాక్షి కమల స్మరుడుండు జముడుండు
లేడితోడఁ మూడు తోడుగాను 5

వంకదీరకున్న వామాక్షి కనుబొమల్
విచ్చుకనులు బాధబెట్ట నిట్లు 6

మత్తగజము కంటి మరుగు పచ్చడమట్లు
స్నిగ్ధ బిగువు చనుల జిలుగుపైట 7

పగతుఁడునుము వట్టి పౌరుషం బరుగంటె
వెలఁది వాసటి మన్న వెలుఁగు గవిన 8

హరిణ నేత్రికేల యాభరణంబులు!
నిగ్గు దేరినట్టి పిగ్గ దాలు. 9

కల్లు ద్రాగకున్న గలుగదు మైకమ్ము
కామ మట్లుగాదు కవినఁ జాలు 10

# ఆలోకనం



కలికి జూపు నొప్పి గలిగించు నొక్కటి
మందుగాఁగ దాని మాన్పు నొకటి। 1

భోగమందు నర్థభాగమ్ము కన్నను
అధికమగును చూపులందె సుఖము 2

చూచెఁ జూచెనంచు జూడంగఁ దలవంచె
మొలకవోయునేమొ వలపు లిట్లి 3

నేనుఁ జూడఁ దాను నేలపైఁ జూచును
జూడకున్న నోరజూచి మరియు 4

నవ్వుకొనుచు లోన నను జూడ నట్లుగాఁ
జూచి యోరగంటఁ సుందరాంగి. 5

నగచుకొన్న విధము బలికిన బలుకులే
స్నేహలతను బెంచు చిత్తమలర 6

పొలఁతి చూపు మాట పొడిచినట్లున్నను
వలపు లేదనంగ వలనుగాదు. 7

చూచినంత నన్ను జూచిన నొయ్యారి
మందహాసమందు మరులు గలదు. 8

తెలియనట్లుగానె తిలకించు ప్రక్రియ
కాముకులకు నచ్చు కైవశమ్ము 9

కండ్లు కండ్లుతోడ గలపిన నిమ్మట
మాటలేటి కింక నోటిచేటు. 10

# పరవశమ్ము



పరవశమ్ము లెందు పంచేంద్రియమ్ములు
పంకజాక్షి తోడు ప్రాప్తమైన — 1

చాలినన్ని గలవు జబ్బుకు మందులు
వలపు జబ్బుకెల్లఁ వనితె మందు — 2

పద్మ నేత్రు శపథము పదతి కౌగిలికన్న
నధిక సుఖమునిచ్చు నదియె కాదు. — 3

తాకకున్న వేడి తాకిన చల్లన
వింతనిప్పు వనిత చెంతఁ గలది — 4

కలసినప్పుడెల్ల నలివేణి కౌగిలి
చొక్కఁ జొక్కఁ మిగుల సుఖమునిచ్చు. — 5

కలికి కరములందు గల దమృతం బొకో
తాకినంతఁ దనియుచుందు నొడలు. — 6

అతివ కౌగలింపు లాకలిదప్పుల
మాన్ప గలుగునట్టి మహిమగలది. — 7

విందుబెట్టి కుడుచు చందంబుగా మందు
కలికి కౌగలింప గలుగు సుఖము. — 8

కలిసినట్లు గలపి కలహించి కూడుట
కామకళకు ప్రణయ ధామమగును — 9

తెలియఁ దెలియఁ దెలియఁ దెలియనిదేమని
కలియఁ గలియనల్లె కామ కళయు. — 10

# ప్రశంస



| | |
|---|---|
| కుశలమా! శిరీష కుసుమమా! నీకన్న<br>మృదు శరీర నాదు హృదయరాణి. | 1 |
| పూలఁజూచి మనస పొంగిపోయెదవేల?<br>చూడఁదగిన కలికి చూపులుండ | 2 |
| పరిమళించు మేను పండ్లన్ని ముత్యాలు<br>తలిరు బోడి బొమలె యలరువిల్లు | 3 |
| కలువపూలకెల్లఁ గనులున్న వనుకొన్న<br>కలికి కనులఁజూచి తలలువంచు | 4 |
| కాడలున్న పూలు కలికికి భారమ్ము<br>కురుల వెరచు నడుము తుఱుగువంచు. | 5 |
| చంద్రుడన్న భ్రమతో చంచలాక్షిని జూచి<br>చుక్కలెల్ల మింట ధిక్కరించె. | 6 |
| పూర్ణచంద్రునందు బొరలుండుఁ గావంగ<br>కలికి మోమునందు గలదె మచ్చ. | 7 |
| పొలఁతి మోము రీతి మురిపింప గలవేని<br>గారవింతునోయి కలువరాజ. | 8 |
| ఉత్పలాక్షి మోము నొప్పుగాఁ దలచిన<br>కంట బడకు మింటఁ గలువరాజ. | 9 |
| అలరులైన గాని హంసతూలికలైన<br>కలికి పాదములకు కంటకములె. | 10 |

# తలపోత



పాలు తేనెగలపి జాలువారిన రీతి
మగువ పంటిపీరు మధురమగును. 1

ఊపిరికిని వొదలి యున్నట్టి సామ్యమ్మె
యామె తోడి నాదు ప్రేమ చెలిమి. 2

కావరాకపొమ్ము కంటిలో పాపాయి
వలపు రాణి కందు వలయు స్థలము 3

బ్రతుకు మందరాంగిఁ బిడయుటలో నుండు
దూరమైనఁ జావు చేరువగును 4

తలచుకొనుట మఱపు కలిగిననేగాద
మరుపలేకపోతి మగువ సొగసు. 5

నేర్పుగాదె ప్రియుడు నేత్రమధ్యము లందు
రెప్పలార్చు బాధఁ దప్పుకొనును. 6

కలఁడు ప్రియుఁడు మాదు కనులంటి కాటుక
వలద నతఁడు మరుగు వంచునెంచి 7

మనసులోనె ప్రియుఁడు మాకుండు గాఁబట్టి
వేడి దివము నతఁడు వాడునంచు. 8

కన్ను మూయ ప్రియుఁడు కనిపించదని నేను
అందు కతని నేల నిందజేయ. 9

వదలకుండ ప్రియుఁడు హృదయంబునందుండ
దూరు దందురేల యూరివారు. 10

# వదంతి



ఎగిరిపోక ప్రాణ మీదాక మందుట
మరుగు మరుగు వాదు మాటగాదె.

రట్టుబెట్టి వారె రచ్చకు దెప్పించి
సఖ్యమునకు మిగుల పాయపడిరి.

ఊరివారికెల్ల మారిపోపిరిగాన
వలపు లతకు వ్రేళ్ళు బలుసుకొనియె

వృద్ధిపొందె వలపు వేమారు దృఢముగా
నోట నోట బడిన మాటవలన.

మైక మబ్బు కల్లు మరి మరి ద్రాగంగ
చెప్ప చెప్ప వలపు చిగురు దొడగు.

ఒక్క దినమె కలసి యున్నది; యూరెల్ల
గ్రహణ చంద్రు విధము గాంతురేల.

ఎరువు పీళ్ళుబెట్టి యెదిగించు కామమున్.
ఊరు గలిపి తల్లి దూరుచైన

ఆడిపోసుకొన్న వాగునె కామమ్ము
ఆజ్యధార వగ్ని నాపవగునః

రట్టుబెట్టి వీధి గుట్టు దీసిన యట్టి
భంగపాటె మాకు భద్రమింక

ఉల్లమలరె మమ్ము నల్లరిపాల్జేయ
మేలె ప్రియుడు విడువకేలు కొనగ

# నిర్వియోగము



విడువలేని నన్ను వదుగుము విడుదైన
వచ్చువఱకు మందువారి వదుగు. 1

సుఖముఁ జూపులందెఁ జూచితి మున్ముందు
దూరమగుట నెంచ దుఃఖ మొదవు. 2

బుద్ధిమంతులకును పొసగును విడిపోవ
విడువ ననుట నమ్మ వీలుగాదు 3

వదల నన్నవాడు వదలుచో నాళతో
నంటుకొన్న దాని దగునె తప్పు. 4

కాచుకొనుచుఁ జెప్పకాంతుని విడనీక
వీడిపోయెనేని కూడు టరుదు. 5

వెళ్ళి వత్తునంచు విడబడు నవ్వాడు
మళ్ళి వత్తునన్న మాట నిజమె 6

విరహ బాధ నెఱుకబరచెడి విధముగా
గాంతు దిట్టఁదొడఁగె గాజు లూడి. 7

వారివారు లేని వాసమ్ము కష్టమ్ము
అరయగా వియోగ మంతకన్న 8

అగ్గివంటి బాధ వనగాదు వలపును
తగులు బాధ దీని దాకకున్న 9

పొగవంపి బాధ సహియించి జీవింప
విష్టపడెడివార లెంద రిలను. 10

# వియోగము



దాచుకొన్నకొలది దాగకఁ గామమ్ము
ఊట నీటివోలె నూరుచుండు. 1

కప్పి పుచ్చ వీలుఁగానట్టి దీ బాధ
చెప్ప వంపనైన సిగ్గుగలది. 2

ప్రాణదండమునకు వలపును, సిగ్గును
కావడట్లు వంగి కష్టపెట్టు. 3

ఉదధి వోలెఁ గామమున్నది దాటంగఁ
దగిన యోడలేకఁ దల్లడిలుదు. 4

కష్టపెట్టునతని కిష్టమున్నప్పుడే
ఇష్టపెట్టగలడె కష్టమున్న. 5

కలసినపుడు సుఖము కదలివంటిదగును
కలయనపుడు దిగులు కదలికన్న. 6

విరహబాధ పీద పీఱుగాకుండఁగా
అర్ధరాత్రి నొంట వలమటింతు. 7

అందఱికిని నిద్ర నందింతు నీరాత్రి
నన్ను తోడు చేసుకొన్న దేమి. 8

విరహ బాధకన్న వేదన గలిగించు
దినదినమ్ము నిశలు దీర్ఘమగుచు. 9

మనసుతోడఁగూడి కనులేగియున్నచో
మోహజలధి నిట్లు మునగకుండు. 10

# ని రీ క్ష ణ



కండ్లు గాదె ముందు కలిగించె కామమ్ము
పరితపించు నిపుడు విరహమునకు. 1

కాంచినంత ప్రేమ కలిగినందుకుగాను
దుఃఖపడగవలయు దూరమైన. 2

ముందుపోయి కనులు మోహమ్ము కొనితెచ్చె
తాళకున్న నిపుడు గేలికాదె. 3

తీర్పులేని బాధ దెచ్చిన యీకండ్లె
యేడ్వవలయు నీర మింకు వఱకు. 4

మోహజలధి నన్ను ముంచిన యీకండ్లె
కుములవలయు నిట్లు కునుకురాక. 5

వరియె కన్నులిట్లు పరితపించుట జూడ
కష్టపెట్టలేదె కాపుమిచ్చి. 6

ఏడ్చి యేడ్చి కన్ను లింకిపోవలయును
చొక్కి చొక్కి ముందు జూచెగాన. 7

మాయమాటలాడి మరుగైనవాని నే
చూడ గోరుచుండు చూపులెల్ల. 8

రావివాళ్ల నిద్ర రాదాయె వచ్చినన్
నీరపించె కండ్లు నిద్రలేక. 9

ఊరివారికెల్ల నోరెత్తి చాటించు
దావలేక కండ్లు కావ భరము. 10

# పారిపోవుట



వలపుగాని విడచి పాఱితి నీరీతి
ఎవరితోడ దీని నెఱుకపఱతు. 1

ప్రియుడె దీని నీకుఁ బ్రియమార నిడెనని
మోహమునకుఁ బాలె దేహమెల్ల. 2

సిగ్గు చెలువుతాను జేకొని బదులుగాఁ
దానమిచ్చె మెరుగు తఱుగఁ దనువు 3

మరువ తరని వలపు మరిమరి చింతింప
పసదొరంగి మేను పాలుబాఱె 4

అదిగో ప్రియుఁడుదాకె నంతలో నామేన
బాలిపోవదొడగె బసిమి చాయ. 5

దీపకాంతి తగ్గఁ దిమిరమ్ము బైకొను
విధము పాలె మేను ప్రియుని బాయ. 6

ప్రక్కనుండి ప్రియుఁడు చెక్కిలి నిమురుచు
ప్రక్కఁజూచినంత బాలెమేను. 7

మోహమునకు బాలిపోయిన దనువారు
దిట్టరేమి పదలి పట్టినాని. 8

మంచిగాను ప్రియుడు మనసీయజాలును
పారిపోవుటైన నగవు జెంద. 9

పాలిపోవుటకును భయమొందగాలేదు
దుష్టుడంచు ప్రియుని దూరరేని. 10

# విరహతాపము



ఒకరి నొకరు వలచి వలపింప కొన్నచో
వారి వశమె కామఫల సుఖమ్ము 1

బ్రతుకు బాగుజేయు వర్షంబు పోలిక
ప్రియుఁడు ప్రేయసియెడ ప్రేమ గనుట 2

కోరుకొన్న ప్రియుని గూడిన కాంతకు
ప్రేమ గర్వ మొందు పెనగుచుండు 3

ప్రియుని ప్రేమలేని ప్రేయసి నెవరెంత
గొప్పఁ జెప్పుకొన్న గొఱత గొఱత. 4

తాను వలపినంత దారసిల్లినదేమి
అతనియందు ప్రేమ యతకకున్న 5

తూకమట్లు నరిగఁ దూగినవే ప్రేమ
ఒక్క పక్షమున్న చిక్కు వచ్చు 6

అందఱి నొకవిధి నాడించు కాముండు
నన్ను మాత్రమేల నలగగొట్టు. 7

ప్రియుని పద్దనుండి ప్రేమలేఖయు లేక
ధైర్యముగను బ్రతుకు తవ్విగలదె. 8

వచ్చి పోవకున్న వార్త విన్ననె జాలు
విందు బెట్టినట్లె వీనులందు. 9

భద్రపరచె మనన బయటికి పొంగక
తాప మణచుకొనుచుఁ గడలివోలె. 10

# తలపోత



మధువుఁ ద్రాగినంత మైకమ్ము గ్రమ్మున
కామమట్లు గాదు గనిన చాలు — 1

ఎట్టులైన నేమి ఇంపౌను కామమ్ము
తలచినంతఁ దీరు తాపభరము — 2

తలచినట్లు దలచి తలఁక మానెనో
వచ్చినట్లు వచ్చి వదలె తుమ్ము — 3

మేము వారి సుదిని మెలగుదుమో లేమొ
మరువ మతని మాదు మానసముల — 4

తలపఁ దతడు నన్ను తానెట్లు వలపింప
సిగ్గు మాలి వాడు చెంతవచ్చు — 5

ఇన్నినాళ్ళు బ్రతికి యున్నది యెట్లన్న
దలచి తలచి ముందు వలపులన్ని — 6

మరతునన్న మాటె మండించు హృదయమ్ము
మరచి బ్రతుకు మాట మాట యగునె — 7

ఎంత దలతుకొన్న నేమవి కినయందు
ప్రియుదౌనుగునట్టి ప్రియమదౌను — 8

ఎంతగానొ చెప్పె నిర్వుర మొకటని
చెంతలేక విపుడు చింతబెట్టె. — 9

విడచినట్టివాని వెదకి పట్టెడుదాక
గదలిపోకుమోయి కలవరాజ. — 10

# స్వప్న సుఖము



దూతగాగ ప్రియుని తోడుక వచ్చిన
కలకు విందుచేతు కనులముందె 1

కాటుక కనులందు కలవచ్చి ప్రియుడున్న
సిగ్గువిడచి యన్న జెప్పుకొందు. 2

ఎదుట లేనివాని నిదురలో గల గని
ఉసురు నిల్పుకొందు మన్నదనుక 3

నేరుగాను జూడ నేరనివారిని
నిదురలోన దెచ్చి నిలుపు వలపు 4

కామ సుఖమునందు కలయు నిజము రెండు
ఒకటిగానె తోచునందు ప్రియుల 5

మేలు కలయె జూడ మేల్కొలు లేకున్న
వదల దగుతః ప్రియుడు స్వప్నమందు 6

నిజ సుఖమ్ము నీయనేరని ప్రియు డేం
కలను వచ్చి యిట్లు కలతబెట్టు 7

నిదురలోన ప్రియుడు హృదయమ్ము పైనుండు
నెదనుజేరు వతఁడు నిదురలేవ. 8

కలలు గనినయట్టి కాముకు లందఱు
పగలు పొగలుచుంద్రు వలపు దలచి 9

వాదుకొంద్రు ప్రియుడు వదరినాడని యూర
కలను వచ్చుటెల్ల కానలేరు. 10

# సంధ్యా సమయము



సంధ్య సంధ్య కాదు చంపంగ వచ్చిన
గాల మగుమగాదె కాముకులను 1

సందెవయ్యా నీవు మంద మందెదవేల
నీకు గూడ తోడు లేకనేన 2

మంచుకనుల సంధ్య మంద మందమ్ముగా
వచ్చి వచ్చి బాధ హెచ్చునరయ 3

విరహులందు సంధ్య ప్రియుడుండ విడిబాచి
వగను దీర్చుకొనును వైరివిధము. 4

ఉదయమునకు నెట్టి యుపకార మొనరించి
సంధ్య కేమి జేయజాలనైతి 5

సంధ్యకాల మింత సంకటంబని నేను
తెలియనైతి ప్రియుని గలిసినపుడు 6

ప్రొద్దుతోడబుట్టి పెద్దదై దినమంత
విరియు సంధ్యవేళ విరహ బాధ. 7

వేణుగాన మపుడు వినిపించె మధురమై
చేదు గాగ నిపుడు చెవిని బడును 8

సద్దుమణిగియుండు సంధ్యలో నూరెల్ల
వాయకుండు లేని నావిధంబు 9

సఖుని విడచిపెట్టి చావకుండెడి నన్ను
చంపుతున్న దిపుడు సంధ్య వచ్చి. 10

# నిర్వేదము



తెలిసియున్న నీకు దెలుపవే హృదయమ్మ
మదన తాపమునకు మందునొకటి 1

వలతువేల నీవె వలపుగాడిట లేక
బ్రతుకు జేతగాని పాడు మనస 2

ఏను నీవు వగచి యేమౌన హృదయా
వలపుగాడు కరుణ దలపఁడేని 3

కనులఁగూడ నీతో గొనిపొమ్ము హృదయమా
కోపపడును ప్రియుని చూపుమంచు 4

ప్రేమఁజూపి వెనుక విడచినాడని తాను
విడువనగునె నేను వెఱ్ఱి మనస 5

బింకమేల మనస ప్రియుని జూచినతోడ
విరహకోపమెల్ల వరుగుదీయు 6

వదలవలయు నొకటి వలపైన సిగ్గైన
వశముగావు రెండు వలపునందు. 7

వలచినట్టివాడు వదలంగఁ జూచియు
వెంటబడుదువేల వెఱ్ఱిమనస 8

తలచునట్టి ప్రియుడు తలపులోనుండఁగఁ
గానరంచు వెదకనౌనె మనస 9

తలపు లేనివాని దలపోయ దలపోయ
జూర జూర మేని సొంపు దఱుగు. 10

# భంగపాటు



ఎగ్గు సిగ్గులనెడి యినుప సంకెళులెల్ల
పగిలిపోవు కామ పరశు హతికి. 1

కామమునకు వేరె కార్యమ్ము లేదొకో
పగలు రాత్రి యనక బాధపెట్టు 2

మరకు మరలు నెంతొ మదనలేదన నన్ను
తోచుకొనుచు నన్ను తుమ్మె వోలె 3

పట్టుసడక యుంటి గుట్టుగా నేనేమొ
బట్టబయలు జేసె వలపు నన్ను 4

ఛీయటన్న గొప్ప చెంత జేరని గొప్ప
కాముకాళి యందు గానరాదు. 5

విసుగు గొన్నవారి వెంబడింపగ నన్ను
బట్టు కొన్న కామ మెట్టి దగుమ. 6

వలసినట్లు నన్ను వలపించు ప్రియునితోఁ
గూడినపుడు సిగ్గు గూడనైతి. 7

పురుషుడాడు కల్లబొల్లి మాటల తీరు
నమ్ము మోసగించు మరుబలమ్ము 8

కోపగించఁ బోతి గోపించు నంతలో
మనసు దీర నతని మరులు గొంటి 9

వేడిజేయ గరుగు వెన్నవంటి మనసు
కాంతు గలియువేళ కరుగకున్నె. 10

# ఉత్కంఠ



కాచి కాచి కనులు కాయలై పోయెను
ఎంచి యెంచి వ్రేళ్ళ యంచు లరిగె 1

అందమెల్ల దొరగి యాభరణము లూడు
నప్పుడైన మరువ నైతి ప్రియుని 2

దూరమేగి నట్టి వారి రాకనుగోరి
బ్రతుకుచుంటి నెన్ని బాధలున్న 3

కలపినట్టి వాని కలియంగ నా బుద్ధి
కొమ్మ కొనల కెక్కె కోర్కె లెదిగి 4

కనుల ముందు ప్రియుడు కనిపించినంతనే
పాండురంపు తనువు పసిమికెక్కె 5

ఒక్కసారి వచ్చి చిక్క నీ చెలికాడు
కామ బాధఁదీరా గరచి తిందు. 6

ఏమి చేతొ దెల్పయనేతేరఁ జెలికాడు
చిత్తమంతలోనె తత్తరించు 7

రాజ గెలచుగాఁత రమణితో యీ ప్రొద్దె
సంధెకాల విందు నందుకొందు. 8

ఒక్క దినమెయైన యుగముగాఁ దోఁచును
కాంతు నెదురు జూచు కామినులకు. 9

ఉన్న మనసు కొంత మాడిపోయెన వెన్క
కలియుటైన యొకటె కలియకొకటె. 10

# భావ ప్రకటన



దాచఁబూను కొవిన దాగగ చెలికండ్లు
భావమొండు దెలియ బరచు వారు. 1

కమల సొంపు, సిగ్గు కరపల్లవంబులు
ప్రేం కోళకెల్ల జీవమిచ్చు. 2

మణుల దారమెల్లు గవిపించునట్టులే
మగువ సొంపువందె మనసు తెలియు. 3

మగువ మర్మ మెల్ల మందహాసము దెల్పు
పరిమళంబు దెలుపు పగిది మొగ్గ 4

గాజులు కదలంగఁ గాదన్న ప్రేయసి
మర్మమందె వారు మందు దొలికె 5

వంది రాక వన్ను తిలకించుటను జూడఁ
వలుక యేమొ పదలి తంచుముందు 6

ప్రియుడు లేదటన్న వేదన జెకన్న
ముందుగానె గాజులందు దెలిపె 7

విన్న ప్రియుని విరచు చెన్నంగ నామేను
వారమైన యట్లు పాలిపోయె. 8

కంకణములు జూచి కాల్జూచి వొయ్యావ
భావమొండు భామ బయట బెట్టు. 9

కాము కాధవెల్లఁ గమచూపులో విర్చి
విడువకొమచె కలికి వలపు బలము. 10

# క ల యి క



కన్నుఁ దలఁచుకొన్న గామమ్మునకు మత్తు
కల్లు ద్రాగినపుడె కలుగు మత్తు 1

అలుక బూనరాదు యావంత యైనను
గుమ్మడివలె వలపు కోర్కెలున్న. 2

నన్ను గనని యట్టి నాథుని గననని
చెప్ప లేక గనుల కలఁపె నతని. 3

కలహ మూఁద దలఁచి కదలితి నో సఖి
దాని మరచి కలయ దలఁచె మనసు. 4

లేఖ వ్రాయునపుడు లేఖిని గననట్లు
కాంతుజూఁడ దప్పు గాంచనైతి. 5

ఉన్న నాడు దోస మొక్కటి దెలియదు
దూరమైన దెలియు దోసగులన్ని 6

మిఱుగబెరిగి నదికి కోవుట వంటిది
కలవు గానితోఁడ కలహమూఁద 7

మాన వౌనె కల్లి మర్యాద గాదని
విడువవగునె ప్రియుని విటుడటంచు. 8

కోమలంబు వలపు కుసుమంబు కన్నను
ననుభవించు వార లరుదు దాని. 9

కోపగించెగాని కోర్కెను దీర్పంగ
ముందు బడెను కౌగిలిందుకొనగ 10

# ఆక్రోశము



వారి వారి మనసు వారితో నుండంగ
నీవు నల్లై యుండ వేల మనస  1

ప్రేమలేని వాని ప్రియుడంచునో మనస
చూచినంత జేర చూచుచేల  2

కాముకులకు వేరె గతిలేమి యెఱిగియో
వెంట దగులుచుంటి వెఱ్ఱిమనస  3

ప్రణయ కోపమందు భయపెట్టినట్లుగా
వలపు దీర్చుకొనక వగతువేల.  4

చేరకున్న బాధ చేరిన విడబాధ
బాధ దప్ప దింక బాడు మనస  5

మనసః నీవు నన్ను దినివేయు చున్నావు
ఒంటరిగను నెట్టు లుండ నింక.  6

మరువరాని సిగ్గు మరచితి ప్రియునందు
మనసు దగిలి వేరుమార్గ మరయ.  7

జీవితాశ నతని చెదుగుల వర్షింప
తనకె లోపమంచు దలచి దలచి.  8

మనసుకన్న తోడు మరి యెవ్వరుందురు
తోడులేదటంచు దుఃఖమేల.  9

తనదు మనసె తనకు నమవు గావప్పుడు
చుట్టరికము వేరు చుట్టుకొనునె.  10

# ప్రణయ కలహము



చేర్చి కౌగిలింప జేయంగ పొలయల్క
ప్రణయ మందు మధుర భావమగును | 1

వలపునందు వలుక వంటకమం దుప్పు
హెచ్చు తగ్గులైన హితము దప్పు. | 2

ఉన్న కోపమల్లై నుచ్చదశకుఁ బోవ
గౌగలింపనైతిఁ గలిసి ప్రియుని. | 3

పొలతి వలుక బాపి బుజ్జగింపక యున్న
లతను ప్రేళ్ళతోడ లాగినట్లు | 4

రసిక వరుల టన్న రమణుల పొలయల్క
నెదద విరియ జేయు గడుసుదనమె | 5

పండు పెక్కువైన పండకగాయైన
విష్ఫలంబె యలుక వియమ మిట్లు | 6

విరహ మెరుగనట్టి ప్రియునితోఁ గలహింపఁ
గలియదేవి మరలఁ గష్టమబ్బు. | 7

అలిగి లాభమేమి యర్థంబుగాకున్న
విరహబాధ హెచ్చి విసుగుబుట్టు | 8

పీరుతోడ పీడ నెమ్మది విచ్చుమ
కలహ భావమిట్లు వలపు గలప | 9

విరహమందు ముంచి వెడలిన వానితో
కోపపడక కోర్కె కూడనెంచు. | 10

# కలహ సూక్ష్మత



తాకవై తి వతవి వెదద రొమ్మును దాకి
ముగ్ధలెల్ల జూచి మురిపిరొట — 1

తుమ్మె తుమ్మువంత తుమ్ముకు మారవి
వణకరింతు వమచు వటక మావి — 2

మాం పెసుకొంటి మానిని వెంటనే
ఎవరు దూర వేషమిట్టు లనియె — 3

పక్కాన గందంటి మక్కువ నీపైన
అందు కలిగె వెవరి కన్న యనుచు — 4

ఇంత పిన్న వినుప నీ జన్మకని చెప్ప
కార దొరగె నీరు కండ్లనుండి — 5
తలపడుండుకుండి తలపంగ మరచితో
అసుడు పరచె గాసిని తవంత. — 6

మంగళమనె తుమ్మ మరువిమునమ్ము తే
ఎవరి దలచి తుమ్మితినె యలుక — 7

తుమ్ము నణచుకొంటి తొయ్యలి వెంటనే
తలచుకొన్న దెవరు దెలుపమనియె. — 8

కొనరి కొనరి యెల్లా కోపంబు దీర్పగా
ఎవరు నేర్పిరనుచు మరల యలిగె — 9

మౌనముగను జూడ మనసుకో నీకున్న
మగువ యెవ్వతె యని మరల యలిగె — 10

# పౌలయలౌక సుఖము



వారియందు నెట్టి నేరమ్ము లేకున్న
కలహమందె వలపు పులకరించు 1

ప్రణయ కలహమందు వలపు వాడినగాని
హానికన్న మేలె యధికమగును 2

కామమందు ప్రణయ కలహమ్ము కన్నను
సౌఖ్యమిచ్చు వేరె స్వర్గమేది 3

కలహమాడి యూడ్చి కౌగలించిన బలము
తలచుకొన్న విపుడు దడను బుట్టు 4

దూరమగుట మంచి. నేరమ్ము లేకున్న
కలపియుంట కన్నఁ గౌగలించి. 5

అరగింపుకన్న వరుగుటలో వింపు
కౌగలింపుకన్నఁ గలహ మింపు 6

కలహమునను గెలుపు వలపునం దోటమి
కలియకందుఁ దానిఁ దెలియనగును 7

రసము ప్రణయమునను నొసలు చెమర్పఁగా
కామకేళిఁ దనియఁ గలహమాడి 8

రమణి యలుక మంత రాతిరి పెఱుగంగఁ
గొపరి యాసఁదీర్పఁ గోరుకొందు 9

కామమునకు ప్రణయ కలహమ్ము జీవమ్ము
భోగమునకు నదియె పూర్ణ రక్ష. 10

—: సమాప్తం :—

# సవరణ పట్టిక

| పుట | వరుస | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 18 | పొగడఁగ | పొగడంగ |
| 13 | 2 | వదసు | నడుసు |
| 13 | 11 | వి జన్మ | కి జన్మ |
| 15 | 5 | వాలివి | నాతివి |
| 16 | 6 | కీదమి | కిదమి |
| 19 | 4 | కృూర | క్రూర |
| 21 | 1 | కృూర | క్రూర |
| 23 | 17 | చాపె | చావె |
| 27 | 12 | లితరు | రితరు |
| 29 | 16 | ఖోరుడుండు | చోరుడుండు |
| 31 | 8 | (చెఱు) | చెఱు |
| 32 | 20 | బెట్టకుండా | బెట్టకుండ |
| 35 | 12 | సురుల | మురల |
| 37 | 15 | కగచాటు కలుగ | కగచాటులు గలుగ |
| 39 | 17 | కెవియొగ్గు | చెవిమూయు |
| 49 | 14 | నా ఆత్మ | నాత్మ |
| 57 | 11 | దాక్షణ్యరహితువి | దాక్షిణ్యరహితువి |
| 64 | 4 | తంత్రయైదు | తంత్రమైదు |
| 65 | శీర్షిక | వాచాలత | వాక్చాలత |
| 66 | 11 | యాకాలన్నను | యాకలన్నను |
| 67 | 14 | తేరుమ | తేరుమ |
| 76 | 19 | గామం | గాపువ |
| 79 | 19 | ఇట్టు లితఁడు | ఇట్టు లితఁడు |
| 93 | 17 | దేలివ | దేవివ |

| పుట | వరుస | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 119 | (శీర్షిక) | పారిపోవుట | పాలిపోవుట |
| 120 | 9 | వలపినంత | వలచినంత |
| 122 | 19 | వదరినాదవి | వదలినాదవి |
| 124 | 18 | గొప్పబడచె | గొప్పబడవె |
| 125 | 4 | బ్రతుకు | బ్రతుక |
| 125 | 5 | యేహొవ | యేహొమ |
| 126 | 5 | మదవలేదవ | మదవ వేదన |
| 126 | 9 | ఛీయటన్న గొప్ప | "ఛీ" యటన్న వారి |
| 127 | 12 | బాధఁదీరా | బాధదీర |
| 128 | 1 | దాగగ | దాగక |
| 129 | 13 | ముణుగు | మునుగు |
| 129 | 14 | కలవు | వలపు |
| 132 | 1 | (తాకనైతి నతవి వెడదరొమ్మును దాకి) | (అతవి వెడద రొమ్ము వంటనైతివి దాకి) |
| 132 | 5 | వెసుకొంటి | వేసుకొంటి |
| 132 | 9 | ఇంత | ఇంక |
| 132 | 18 | మరల | యింతి |
| 133 | 14 | కలియకందు | కలయకందు |

